# కురుగంటి కథావళి








సంపాదకులు

శ్రీ బి. రామరాజు, ఎం. ఏ., పిహెచ్. డి.,

శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు, ఎం. ఏ.

# కృతజ్ఞత

కీర్తిశేషులు శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులవారి సాంవత్సరీకముల సందర్భమున గద్వాలలో శ్రీ పిల్లలమఱ్ఱివారి ఆధ్వర్యమున జరిగిన సమావేశములో "శ్రీ కురుగంటి గ్రంథావళీప్రచురణసంఘ" మేర్పాటు చేయడమైనది. కీర్తిశేషులపేర యోగ్యులైన భాషావిద్యార్థులకు ఏతన్నిధి నుండి బహుమానము లేర్పరచు సంకల్పము నామోదము పొందినది.

సాహిత్యపితామహులు, దేశభక్తులునైన ఆచార్య కురుగంటివారి శిష్యులు, మిత్రులు, బంధువులు, అభిమానులు ఎల్లరు విరివిగా విరాళములను పంపుచు, ప్రచారము చేయుచు, కీర్తిశేషుల ముద్రితాముద్రిత గ్రంథావళీ ప్రచురణోద్యమమును చురుకుగా, విజయవంతముగా కొనసాగుటకు తోడ్పడవలసినదిగా ప్రార్థించుచున్నాము.

మా యీ ఉద్యమమును ప్రోత్సహించుచు సందేశములను పంపిన మహోదయులకు నమోవాకములు.

మున్ముందుగా విరాళములను పంపి ముందంజవేయుటకు మాకు ఉత్సాహమును ధైర్యమును కూర్చిన ఉదారులకు కృతజ్ఞులము.

ప్రథమవర్ధంతి ప్రచురణముగా ఈ "కురుగంటి కథావళి"ని ముద్రించి పాఠకలోకమునకు సమర్పించుచుంటిమి. దీనిని రమ్యముగా ప్రచురించుటలో శ్రమించిన సంపాదకులకు నమస్సులు.

ఈ కథావళికి మచ్చులైన చిత్రముల రచించి యిచ్చిన వర్ధమాన చిత్రకారుడు శ్రీమారేమండ శ్రీనివాసరావు (గుంటూరు) గారికి మా కృతజ్ఞత.

మా యీ ప్రచురణోద్యమమును ప్రభుత్వమువారు, ప్రాజ్ఞులు విజయవంత మొనర్తురుగాత.

ప్రథమవర్ధంతి
4—11—1960.

కురుగంటి కృష్ణమూర్తి, గద్వాల
పోతుకూచి సాంబశివరావు, సికిందరాబాదు
కార్యదర్శులు

## :: ఉదారులు ::

డాక్టరు శ్రీ వెంపటి సూర్యనారాయణగారు, తెనాలి.

శ్రీ జె. కిషన్‌రావుగారు, గద్వాల.

శ్రీ గిర్మాజి ఈరన్నగారు, నాగులదిన్నె.

★

"ధర తెన్గు తోఁటకున్ జె
క్కురు, గంటిరిగాని నేఁడు కురుగంటికి బం
గరు కానులతో తూఁగెడి
దొరఁ గాంతురె? భాగ్యనగరి! తులపై నిలపై!"

—శ్రీ వేదాంతకవి.

★

ముఖ్య సంపాదకులు

శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు, ఎం. ఏ,

శారదా పీఠము : పట్టాభిపురము : గుంటూరు - 2.

## శ్రీకురుగంటి గ్రంథావళీ ప్రచురణ సంఘం

# MESSAGES

(Copy of the letter dated 27th Oct. 1960
Vice-President, Govt. of India, New Delhi)

Dear SRI KRISHNA MURTY,

Thank you for your letter of Oct. 25 th.

*I am glad to know that you propose to have a function on the 4th Nov. the first anniversary of the passing away of Kuruganty Sitaramiah. I had known him from the time he was a student of the Madras Presidency College and I watched his work in Hyderabad with great interest. It is good to know that you will publish one of his books that day.*

Yours sincerely,
(Sd.) **S. RADHAKRISHNAN.**



(Copy of the letter from Dr. B. Gopala Reddy,
5 Dupleix Rd., New Delhi).

My Dear SRI KRISHNA MURTHY,

Thanks for your letter dated 28th Oct.

*I am happy to learn that you are celebrating the first anniversary of late Prof. Kuruganty Sitaramaiah on the 4th Nov. Having read some of his works and known him personally, he was responsible for a good deal of renaissance spirit in Telangana. May his memory be ever fresh in our minds and inspire us to greater heights of devotion to Telugu language and literature.*

Yours Sincerely,
(Sd.) **B. GOPALA REDDY.**

# సందేశము

అయ్యదేవర కాళేశ్వరరావు
ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ ఎసెంబ్లీ
స్పీకరు

నాగార్జున విహార్
హిమాయతు నగర్
హైదరాబాద్
తేది 30-10-1960.

కీర్తిశేషులైన శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులవారు గొప్ప దేశాభిమాని, భాషాసేవకులు, గొప్ప పండితులు; వారితో అనేక సంవత్సరములనుంచి స్నేహము కలిగియుండు భాగ్యము నాకు కలిగినది. ప్రథమమున వారు సర్కారు వుద్యోగమును విడిచిపెట్టి 1920వ సంవత్సరములో అసహాయోద్యమములోకి వచ్చి విజయవాడలో స్థాపింపబడిన జాతీయ కళాశాలకు కొన్ని సంవత్సరములు ప్రధానాచార్యులుగా గొప్పసేవను చేసియున్నారు. పిమ్మట హైదరాబాదు నగరములో ప్రవేశించి అనేక గ్రంథములు వ్రాసి గొప్ప ఆంధ్రభాషాసేవ చేసియున్నారు. తంజావూరులోని గొప్ప గ్రంథాలయమునుంచి అనేక ఆంధ్ర గ్రంథములను తీసుకొని వచ్చి ప్రచురించిన సారస్వత సేవకు లాయన. నవీన ఆంధ్ర గ్రంథకర్తలను గురించి ఆయన వ్రాసిన సుప్రసిద్ధ గ్రంథము అమూల్యమైనది. వారి అకాల మరణమువల్ల ఆంధ్రదేశమునకు తీరని నష్టము వాటిల్లినది.

అయ్యదేవర కాళేశ్వరరావు.

# శ్రద్ధాంజలి:

భాగ్యనగరాంధ్రుల కనుమొరగింది కాలం. ఎవరికి తెలియకుండానే ఒక సంవత్సరం గడచిపోయింది. కీ. శే. కురుగంటి సీతారామయ్యగారు పరమపదించి ఏడాది దాటింది. వారు గతించిన తరువాత అక్కడక్కడ కొన్ని సంతాపసభలు జరిగినవి. కొన్ని పత్రికల్లో వారినిగూర్చిన వ్యాసాలు ప్రచురింప బడినవికూడా. అన్ని సభల్లోను, అన్ని వ్యాసాల్లోను ఏకగ్రీవంగా చెప్పబడిన కొన్ని విషయాలున్నవి. కురుగంటివారు ఖండితవాది అనీ, సాహిత్యతపస్వి అనీ, మహాపరిశోధకుడనీ ఆయనను పొగడుతూ, యువకులైనవారంతా కీర్తిశేషుల సాహిత్యదీక్ష అలవరచుకోవలెనని, ఆయన గ్రంథాలు ప్రచారంలోకి రావలెననీ, అముద్రితాలుగా ఉండిపోయిన వారి గ్రంథాలు, వ్యాసాలు ప్రకటింపబడవలెననీ అందరూ అంగీకరించినారు. మనం ఈపనులుచేస్తేనే నిజంగా వారి ఋణం తీర్చుకోగలమనీ, వారిఆత్మకు శాంతి కలుగుతుందనీ అనుకున్నాము. ఇవేవీ ఆచరణలోనికి రాలేదు సరికదా మనం అసలు కురుగంటివారినే మరచిపోయినాము. ఇది నిజంగా విచారింపదగిన విషయం. తెలుగు తేదీ ప్రకారంగా 24-10-1960 నాటికి వారు పరమపదించి సరిగా సంవత్సరమౌతుంది. ఆంధ్రసాహిత్యాభిమానులందరికి ఒకసారి కురుగంటివారిని జ్ఞాపకం చేయటం నాకర్తవ్యమని భావిస్తున్నాను.

* * * *

శ్రీసీతారామయ్యగారు ఎన్నో ప్రశస్తమైన గ్రంథాలు రచించినారు.

* * * *

విమర్శనాత్మకములు పరిశోధనాత్మకములూ ఐన వ్యాసాలు ఎన్నో పత్రికల్లో ప్రకటించినారు.

# మనవి:

కీర్తిశేషుల అముద్రిత గ్రంథాలనూ, వివిధ వ్యాసములనూ అచ్చు వేయుటకు వారి అల్లుడైన శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావుగారు నడుముకట్టినారు. సాహిత్యాభిమాను లందరూ వారికి అండగా నిలిచి ఆర్థికంగా తోడ్పడితే ఈ కార్యం సులభసాధ్యం. లేకపోతే కానిపని.

ఈసందర్భంలో నాదొక మనవి. శ్రీ సీతారామయ్యగారు స్థాపించిన సంస్థలూ, తోడ్పడిన సంస్థలూ, నిర్వహించిన సంస్థలూ హైద్రాబాదులో కొన్ని ఉన్నవి. ఆయా సంస్థలవారు చొరవచేసికొని ముందుకువచ్చి కావలసిన ఆర్థికస్తోమత సమకూర్పవలెనని నా మనవి.

కీర్తిశేషులకు ఎందరెందరో ప్రత్యక్షశిష్యులు, పరోక్షశిష్యులూ, అభిమానులూ ఉన్నారు. ఎవరో ఒకరు ముందుకువచ్చి ఈ పని ప్రారంభిస్తే వీరంతా తప్పక ఆర్థికంగా తోడ్పడుతారు. ఈసందర్భాన ఒక ఉపాయం మనవిచేస్తాను. ఇప్పుడు మనకు ఆరేడు దినపత్రికలున్నవి. ఏపత్రికవాళ్ళయినా అభిమానించి "సురవరంవారి నిధి" అని ప్రారంభంచేస్తే రెండుమూడు మాసాల్లో వారి పుస్తకాలన్నీ అచ్చుకావటానికి తగిననిధి ప్రోగు కాగలదు. ఈ విధంగా వారి గ్రంథాలు అచ్చువేసి ఋణం తీర్చుకొన్నవారం కాగలము....

కీ. శే. సురవరంవారికి సాంవత్సరిక శ్రద్ధాంజలి సమర్పిస్తూ ముగిస్తున్నాను.

—డాక్టరు. బి. రామరాజు.

# ఆచార్య కురుగంటి సీతారామయ్య

(జీవిత సంగ్రహము)



జననము: 15-12-1890 గుంటూరు మండలము, తెనాలి తాలూకా వేమూరులోని సుప్రసిద్ధ విద్వద్వైదిక కుటుంబమున. తల్లి మహాలక్ష్మి. తండ్రి సుబ్రహ్మణ్యాచయనులు (అద్వైతానందతీర్థులు) విద్యాభ్యాసము: వేద శాస్త్రాధ్యయనము - నిత్యనైమిత్తికాది కర్మానుష్ఠానము. కొల్లూరు, బెజవాడ పాఠశాలలలో. మద్రాసు రాజధానీ కళాశాలలో 1912 - 1917. బి. ఏ. ఆనర్సు సంస్కృతభాషా సాహిత్యాలలో ప్రప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణత. ఎం. ఏ. పట్టస్వీకారము. స్వర్ణపతకగృహీత - 1917-18. మద్రాసు విశ్వవిద్యాలయమున పరిశోధక విద్యార్థి. 1921 యల్. టి. 1929 ఫస్టుగ్రేడు ప్లీడరు పరీక్షలో ఉత్తీర్ణత.

ఉద్యోగములు: 1918-20 సబ్ అసిస్టెంటు ఇన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సు. 1920 సత్యాగ్రహియై రాజీనామా. 1921-1930 అసహాయోద్యమమున కాంగ్రెస్ సేవ. 1922-23 బెజవాడ జాతీయకళాశాలా ప్రధానాచార్యులు. 'విద్యార్థి' పత్రికాసంపాదకులు. ఒంగోలు జాతీయకళాశాలాచార్యులు. కొవ్వూరు గీర్వాణవిద్యాపీఠ ప్రధానాచార్యులు. 1929-30 తెనాలిలో ప్లీడ

రుగా ప్రాక్టీసు. 1931–33 తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయపు సూపరింటెండెంటు. 1933-47 హైదరాబాదు నిజాంకళాశాలసంస్కృతాంధ్ర భాషాచార్యులు. H. C. S. విద్యార్థులకు, ఎం. ఏ. (తెలుగు) విద్యార్థులకు ఆంధ్రాచార్యులు. జాగీర్దారు కళాశాలలో సంస్కృతాచార్యులు. 1947-50 హైదరాబాదు సమాచారశాఖలో ద్విభాషి: దక్కన్ రేడియోలో స్క్రిప్టు రైటర్. 1950-54. ఉస్మానియావిశ్వవిద్యాలయములో తాళపత్రగ్రంథాలయాధికారి. 1954-59 ఉస్మానియాలో సంస్కృత అకాడమీ ఉపాధ్యక్షు సంపాదకులు. పారిభాషిక పదకోశ సంఘ ప్రముఖసభ్యులు. సంక్షిప్తాంధ్ర విజ్ఞాన కోశ మత విభాగ సంపాదకులు.

ప్రతిభ : కవి, కథకులు, వక్త, నవలాకారులు, నాటికాకారులు, సంపాదకులు, బహుభాషావేత్త, ధీరోదాత్తమూర్తి, సంప్రదాయాజ్ఞులు, భాషా సాహిత్యచరిత్ర పరిశోధకులు, వైదికోత్తములు, బహుగ్రంథనిర్మాత, పీఠికాకర్త, హాస్యకుశలురు, సత్యవాది, నిష్ఠాగరిష్ఠులు, శివదీక్షాదురంధరులు, వేదాంతి,నిర్భీకవిమర్శకాగ్రణి, జీవితచరిత్రకారులు, సర్వస్వతంత్రులు, దేశభక్తులు, త్యాగమూర్తి; తంజాపుర, నవ్యాంధ్రసాహిత్యచరిత్రలపై, అలంకారశాస్త్రముపై ప్రమాణికులు. పాకకళాప్రవీణులు, తెలంగాణాసాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ నాయకాగ్రణి; మహాపురుషులు-మార్గదర్శి-మహర్షి!

బిరుదములు: మహోపాధ్యాయ-భట్టాచార్య - సాహిత్యపితామహ.

సంస్థలు : 'విజ్ఞానమూర్తి మండలి'— సాహితీసమితి – ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు – హిస్టరీకాంగ్రెసు సభ్యులు – హైదరాబాదాంధ్ర సాహిత్యపరిషత్ కార్యదర్శులు – నవ్యసాహితీసమితి ప్రథమాధ్యక్షులు – వేమనాంధ్ర భాషానిలయోపాధ్యక్షులు—నాంపల్లి రామభక్త సమాజ కార్యదర్శులు.

నిర్యాణము : 4-11-1959 (నాగులచవితి) 89. బి. నాంపల్లి – హైదరాబాదు స్వగృహములో, భగవధ్యాన నిమగ్నులై!

— పిల్లలమర్రి

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

శీలవతియగు

నా అర్ధాంగికి



నా ఉద్దేశములో వ్యక్తి
శీలము చాల పవిత్రము.
శీలమును చెడగొట్టు
ఆధునికతా, స్వాభావికతలను
నేను భరించలేను.

'కాంతా సమ్మిత తయో
ప దేశయుజే' అను లాక్షణిక
వాక్యము నాకు పరమ ప్రమాణము.

—కురుగంటి



# MESSAGE

Sri Madapati Hanumantha Rao
*Chairman*
Andhra Legislative Council

Dear Sir,

I know late Sri KURUGANTI SITARAMAIAH for more than 40 years. He had rendered yeo-man service to the Telugu Literature and earned the name and fame as the best critic as well as a scholar. His contribution to Telugu Literature is everlasting and he will be remembered for generations to come.

I am quite confident that his son now venturing to publish his books will receive high encouragement from the Andhra Public.

May God bless him with success in this literary enterprise.

With best wishes,

Ananda Nivas
Barakatpura
Hyderabad
26-10-1960

Yours sincerely
(Sd) M. Hanumantha Rao.

# కరివేప చెట్టు

## ౧

రామారావుకు ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు. కుమార్తె లిద్దరూ వివాహాలై భర్తలవద్దకు వెళ్ళిపోయినారు. ఇద్దరూ సంతానవంతులై దోసతోటలవంటి వారి కాపురాలు వారు చేస్తున్నారు. పిల్లవాడూ తనూ యింట్లో యిద్దరే. ఆయన భార్య చనిపోయి కొన్ని వత్సరాలైంది. ధనవంతుడు కాకపోవడంచేత వంటమనిషిని పెట్టుకోలేక, తనకువచ్చే కొద్ది జీతంతోనే తనే వంటచేసి పిల్లవానికి పెట్టి బళ్లోకిపంపి తాను వుద్యోగానికి పోతూ కాలం గడుపుతున్నాడు. చుట్టుపక్కల వారందరికీ ఆయనంటే యెంతో గౌరవం. ఏవస్తువుకూ అప్పుకు వెళ్ళేవాడు కాడు. పక్కవారందరికీ ఆయనకే అవసరమైనా వస్తే సహాయం చేతామని వుంది. కాని అవకాశం దొరకడం లేదు.

ఒక్క విషయంలో మాత్రం అందరికీ ఆశ్చర్యంగా వుండేది. వాళ్ళ దొడ్లో ఒక కరివేపచెట్టు వుంది. కరివేపచెట్టు పెరగడం చాలా కష్టం. దానికి కుడితి పోస్తేనేకాని పెరగదు' ఆలాగే కష్టపడి దాన్ని పెంచేడు. పచ్చగా చిగురువేసి కొంచెం గుబురుగా పెరిగింది. అది దొడ్లోఉన్నా రామారావు కరివేపాకు బజారునుంచే తెచ్చుకుని వాడుకునేవాడు. ఎవ్వరూ చూడకుండా ఉన్నప్పుడు చెట్టుదగ్గిరకు వెళ్ళి దాని పొంకం ఆకువొత్తు, కొమ్మల విశాలం చూచి సంతోషిస్తూ

వుండేవాడు. ఒక్కొక్కప్పుడు చెట్టువంక చూస్తూ తన్మ యుడై పోయేవాడు. అది పెరిగిన కొద్దీ ఆయన సంతోషం పొంగుతూ వుండేది.

పొరుగింటి పిల్లలువచ్చి దానిమీద చేయివేస్తే వాళ్లను గుండలించేవాడు. ఒకనాడు ఆయన మార్కెట్టులో కరివేపాకు కొంటూంటే పక్కయింటి సుబ్బారాయుడుగారు చూచి,

"ఏమండీ రామారావుగారూ మీదొడ్లో కరివేప చెట్టుండగా మీరుకూడా కరివేపాకు కొంటున్నారేమండి" అన్నారు.

ఈయన కంట అదెప్పుడు పడ్డదా అనుకుంటూ "చిన్న చెట్టండీ, ఇప్పుడే ఆకు దూయడం మొదలెడితే చెట్టు చెడిపో తుందని కొంటున్నాను." అన్నాడు రామారావు. చెట్టంటే ఆయన కెంత ప్రీతో ఆశ్చర్యపడుతూ సుబ్బారాయుడుగా రా సంభాషణ నంతటితో వదిలివేసినారు.

౨

అప్పటినుంచీ చెట్టును ఎవరైనా చూస్తారేమో దృష్టి దోషం తగులుతుందని రామారావు ఎప్పుడూ తలుపులు మూసే ఉంచేవాడు. బయటకు కనబడకుండా బట్ట అడ్డం కట్టిం చాడు. చెట్టు క్రమంగా వైశాల్యం పెరుగుతున్నది; పొడుగూ యెదుగుతున్నది. రామారావు తన స్వహస్తాలతో దానికి కుడితి పోస్తూండేవాడు. అది పెరిగినకొద్దీ రామారావు మొగం కూడా వికసించింది. కరివేపాకు బజారునుంచి తెచ్చుకోటం మానలేదు.

ఒకనాడు పక్కయింట్లో వీధి అమ్మలక్క లంతా చేరారు. సంభాషణ సాగించారు. వాళ్ళ మాటలు రామారావుకి వినబడుతునే ఉన్నవి.

"సుబ్బమ్మగారూ! చూచారూ, మొన్న ఉప్మాలోకి ఒక కరివేప రెబ్బ యివ్వమని మాఅబ్బాయిని పంపిస్తే రామారావుగారు వీలులేదన్నారు" అన్నది రాజమ్మ. "అలాగా అండీ! ముష్టి కరివేపాకు భాగ్యానికి" అన్నది సుబ్బమ్మ.

"ఒకమారిలాగే అంటే వెంటనే ఒక మొక్క తెచ్చి పాతాను మాదొడ్లో. వీరి చెట్టేనా మనకు గతి" అన్నది వెంకమ్మ.

"మాపిల్లవాడి ముద్దుమాటలకే కోసి యివ్వాచ్చే" అన్నది రాజమ్మ.

"ఆయనే కరివేపాకు మార్కెట్లో కొంటూ ఉంటారు, నీవెప్పుడు కరివేపాకుకోసం వాళ్ళింటికి పంపవద్దని మావారు నాతో చెప్పారు" అన్నది సూరమ్మ.

"పైసా పెడితే కట్ట కరివేపాకు. ముష్టి భాగ్యం" అన్నది రాజమ్మ.

"పోయేటప్పుడు కట్టుకుపోతాడా కరివేప చెట్టును" అన్నది వెంకమ్మ.

"మాయింటి కెందుకైన పంపడూ? మొగాన కొట్టినట్టే లేదంటాను" అన్నది సూరమ్మ.

"ఇన్నాళ్లనుంచీ ఉన్నామా పక్కను. ఒక్కదానికైన

మన ఇండ్లకు దేనికైనా పంపడం మన మెరుగుదుమా? అన్నది లక్ష్మమ్మ.

"చూతాం! వెయ్యి ఉన్న అమ్మకైనా వేపుడు మంగల మన్నారు. రాని ఎప్పుడైనా చెపుతాను." అన్నది సూరమ్మ.

"మామూలుగా ఆయన దేముడివంటి మనిషి. ఒక్క కరివేపాకు దగ్గిరే గట్టి పట్టు" అంది సుభద్రమ్మ.

"ఈ మధ్య చెట్టు యెవరైనా చూచి పోతారేమో అని తలుపులుమూయటం. దాచి ఉంచటం మొదలు పెట్టాడు" అన్నది రాజమ్మ.

"దాచు కోనీ, మన కేం? కరివేపాకు లేక పోతే ఛస్తామా" అన్నది వెంకమ్మ.

"వాళ్ల వస్తువు వాళ్ల యిష్టమూ అంటే మీా కెందుకరా యింత తర్జన భర్జన" అన్నది సుభద్రమ్మ.

"పోనీ లే, ఉట్టి కట్టుకుని ఊరేగమను" అన్నది రాజమ్మ.

## 3

ఈ సంభాషణంతా వింటూఉంటే రామారావుకు చాలా విచారం వేసింది. ఇందరి నోళ్ళల్లో పడ్డ కరివేప చెట్టు యేమౌతుందో అని భయం వేసింది. మాఘమాసం వచ్చింది. ఒకనాడు కరివేప చెట్టులో ఒక ఆకు పురుగు కనబడింది. రామారావుకు మనస్సు చివుక్కుమన్నది. తీసి పారేశాడు. నాలుగు దినాలకు మళ్ళీ రెండు మూడు కన పడ్డాయి. పొగాకు నీళ్లు చల్లితే పురుగు చస్తుందంటే చల్లించాడు. వెలుబూడిద చల్లిం

చాడు. ప్రయోజనం లేక పోయింది. ఆకు ఊడిపోవడం ప్రారంభించింది. క్రమంగా యీనలు మిగిలి పోయినాయి. కరి వేప చెట్టెల్లా క్షీణించిందో రామా రావల్లా క్షీణించడం ప్రారంభించాడు. ఏవరి కీ సంగతి తెలుసు?

రామారావు చిక్కి పోతున్నాడని అంతా అనుకుంటున్నారు. కరివేప చెట్టుకూ రామా రావు ఆరోగ్యానికీ లంకె అని యెవ్వరికీ తెలియదు. అన్నం ముందర కూచుని సహించక లేచి పోయేవాడు. కరివేప చెట్టు దగ్గిరకు వెళ్ళి కళ్ల నీళ్లు కుక్కుకునే వాడు. మరు నాడు యింకా కొంచెం కిందికి యెండి పోయింది. ప్రొద్దు గూకేటప్పటికి రామారావుకు జ్వరం వచ్చి పడక వేశాడు.

పిల్ల వాడు యింటికి వచ్చి డాక్టరు కోసం వెళ్లాడు. డాక్టరు వచ్చి పరీక్ష చేస్తే కారణం యేమీ కనబడటంలేదు. ఏదో మిక్స్చరు వ్రాసి యిచ్చాడు. రెండు, మూడు, నాలుగు, అయిదు దినాల లాగే ఉంది. వారం దాటింది. తగ్గు సూచన లేమీ కనపడ లేదు. ఆడ పిల్ల లిద్దరికీ ఉత్తరాలు వ్రాశారు. తొమ్మిదో రోజున పిల్లలూ అల్లుళ్ళూ వచ్చారు.

ఆదినం డాక్టరు వచ్చినతర్వాత,

"ఏమండీ డాక్టరు గారూ, ఏం జ్వరమండీ" అన్నది పెద్దమ్మాయి దీనంగా. చిన్నమ్మాయి దిగాలుపడి నిలుచుంది.

"ఇంకా తేల్చి చెప్పటానికి వీల్లేదు" అన్నాడు డాక్టరు. రక్తం పరీక్ష చేశాడు. మలేరియా కాదన్నాడు. ఊపిరితిత్తులు ఆరోగ్యంగా ఉండటం వల్ల ఇన్ఫ్లూయెంజా కాదన్నాడు.

"కొంపతీసి సైఫాయిడుకిందికి దిగదు కద" అన్నది పెద్దమ్మాయి కళ్ళనీళ్లు తుడ్చుకుంటూ.

"రేపు చెబుతాను" అన్నాడు డాక్టరు.

అంతా దుఃఖాక్రాంతు లైనారు, రామారావు ఇదంతా వింటున్నట్టే కనపడ్డాడు. మాట్లాడలేదు. రాత్రి యెవ్వారికీ అన్నం సహించలేదు. చిన్నమ్మాయి కొంచెం నిద్రపోయింది. కాని పెద్దమ్మాయికి కంటిమీద కునుకు రాలేదు. తండ్రి మంచం ప్రక్కనే కూచుని ఉన్నది. అప్పుడప్పుడు వొళ్లు పట్టి చూడటం. 'నాన్నా' అని పలకరించటం, దాహ మంటే నీరు తాగించటం మొదలైన పనులు చేస్తున్నది.

ఇంతలో రామారావు ఉలిక్కిపడి లేచాడు'

"నాన్నా, నిద్రపో, నే నిక్కడే ఉన్నాను" అన్నది పెద్దమ్మాయి.

"పెద్దమ్మాయీ!"

"నాన్నా"

"కరివేప చెట్టుకు కుడితి పోస్తోన్నారా అమ్మాయీ?"

పెద్దమ్మాయి కేమీ అర్థం కాలేదు. కాని రామారావును నెమ్మదిపరచటానికి "పోస్తున్నాం నానా" అన్నది పెద్దమ్మాయి. రామారావు మళ్ళీ మాట్లాడలేదు. నిద్రపోతున్నట్టు కనపడ్డాడు.

ప్రతిరోజూ అడగటం మొదలెట్టాడు. పోస్తున్నామనే చెప్పుతున్నారు. ఆరోజు ఫాల్గుణ బహుళ అమావాస్య.

డాక్టరు మందువల్ల గాని ఇంజెక్షన్లవల్లగాని యేమీా నయంలేదు. వచ్చిన జ్వరం జారలేదు. ఇప్పటికి పధ్నాలుగు రోజులైంది. మూడోవారం వస్తే ఫర్వాలేదనుకుంటున్నారు. ఇంతలో నాటువైద్యుడికి కూడా చూపిస్తే మంచి దనుకుంది పెద్దమ్మాయి. పిలిపించింది. ఆయన వచ్చి చేయిచూచి, పెద్దమ్మాయిని అవతలకి పిలిచి "ఈదినం అమావాస్య. మీానాన్నను జాగ్రత్తగా చూస్తూఉండు. ఇవ్వాళా రేపూ గడిస్తే ఫరవాలేదు. ఈసంగతి నాన్నకు తెలియనివ్వకు." అని చెప్పి వెళ్ళిపోయినాడు. ఇంటిల్లిపాదికి గుండెల్లో రాయి పడ్డట్లయింది. ఇంట్లో ఆరాత్రి ఎవరికీ నిద్ర లేదు. అంతా మంచంచుట్టూ మూగారు. రామారావు ఏదో లోపల గొణుగుకుంటూ ఉన్నాడు. దీనివల్ల మరింత భయంవేసింది అందరికి.

"పెద్దమ్మాయి" అన్నాడు రామారావు.

"నాన్నా"

"కరివేపచెట్టు కొమ్మ ఎండిపోవట మేలాగున్నదో చూచి చెప్పమ్మా!"

"ఇప్పుడు అమావాశ్య చీకట్లో ఎలా కనబడుతుంది నాన్నా"

"ఇప్పుడు అర్థరాత్రేమిటే! నామీాద యెండ పడుతున్నది."

ఈమాట సంధి మాటని అందరు గుస గుస లాడుకున్నారు.

"పడుకో నాన్నా. మంచినీళ్ళు కావాలా? కొంచెం పాలు తాగుతావా?"

"ఇంతకుముందే అన్నంతింటే అప్పుడే పాలేమిటే అమ్మాయీ?"

అందరికీ మరింత భయం వేసింది.

"కళ్లు మూసుకుని పడుకోవ్వా నాన్నా?"

"కరివేపచెట్టు చూస్తుంటే కళ్ళు మూతలెలాపడ తాయే?"

ఈమాటలన్నీ అగమ్యంగా ఉన్నవి యింటిల్లపాటికీ. "ఏమండి, డాక్టరు నొక్కమారు పిలుస్తారూ" అన్నది పెద్ద మ్మాయి భర్తతో. ఆయన డాక్టరుని పిల్చుకొచ్చాడు. డాక్టరు ఒక యింజక్షను యిచ్చి వెళ్ళాడు. కొంచెం నిద్ర పట్టినట్లయింది. తెల్లవారుజామున అందరికీ కునుకు పట్టింది.

"కరివేప చెట్టు, కరివేపచెట్టు" అని గిగ్గరగా అరిచాడు రామారావు:

అంతా ఒక్కమాటు లేచారు. మంచం చుట్టూ మూగారు.

"ఇప్పుడు డాక్టరుగారు వచ్చి మాత్రం ఏంచేస్తారు. మన అదృష్టం, అయినా ఆచార్లగారిని ఒక్కమారు రమ్మ నండి అన్నది పెద్దమ్మాయి. చిన్నమ్మాయి చతికిలబడి ఏడు స్తున్నది. పిల్లవాడు బిక్కమొగం వేసుకుని కూచున్నాడు.

పెద్దల్లుడు వెళ్ళివచ్చి "ఆచార్లుగారు ప్రొద్దున్నే చెప్పా

రట; ఇప్పుడు వచ్చిన ప్రయోజనం లేదన్నాడు" అని చెప్పాడు ఒక్కమాదు అంతా గొల్లుమన్నారు.

"ఎందుకర్రా యేడుస్తున్నారు? కరివేపచెట్టును చూచు కోండర్రా" అన్నాడు రామారావు;

"నాన్నా, చీకటితో లేచి కరివేపచెట్టు సంగతి చూచి మరీ చెబుతాను. ఇప్పుడు పడుకోవ్వూ? పెద్దమ్మాయిని నేను చెబుతూంటే వినవ్వూ" అంటూ పెద్దమ్మాయి తండ్రి గడ్డం పట్టుకుంది. రామారావుకు కండ్ల నీళ్ళు వచ్చినట్టు కనబడింది. పెద్దమ్మాయికి కూడా కళ్ళనీళ్ళు గిర్రున తిరిగినై.

"కరివేపచెట్టు ఎవరనుకున్నావు? మీ అమ్మ" అన్నాడు రామారావు డగ్గుత్తికతో.

"కాశిని మంచినీళ్ళివ్వనా"

"ఇయ్యి"

మంచినీళ్ళు రెండు గుక్కలు తాగి కొంచెం కళ్ళు మూశాడు.

అందరూ చేరి రామారావుమాటల్లో ఉన్న అర్థం గ్రహించ లేక బాధపడుతున్నారు. కరివేపచెట్టుకూ, జబ్బుకూ సంబంధ మేమిటో యెవ్వరికీ బోధపడకుండా ఉన్నది. కాని సంబంధ మున్నట్లు మాత్రం స్పష్టం. ఈ అల్లరిలో పక్క యింటివాళ్ళకు మెలుకువ వచ్చింది. సుబ్బారాయుడుగారూ సూరమ్మా వచ్చారు.

"ఎలా ఉన్నదమ్మా శకుంతలమ్మగారూ మీనాన్నకు?"

"ఎలావున్నదని చెప్పను? మహాసముద్రంలో ఉన్నాము కలలో కూడా కరివేపచెట్టును స్మరిస్తున్నాము. మా అదృష్ట మెలాఉందో?"

సూరమ్మ ఏదో ఆలోచిస్తూ నిలుచున్నది.

ఇంతలో రామారావు లేచి —

"పెద్దమ్మాయీ" అన్నాడు.

"ఏమిటి నాన్నా" అన్నది, తండ్రి మొగంమీద వాలి శకుంతలమ్మ.

"చూచావా, ఇరుగు పొరుగువాళ్ళంతా మన కరివేప చెట్టుకు దిష్టి కొట్టారు. నేను కరివేపచెట్టును పోయేటప్పుడు కట్టుకుపోతానట! ఉట్టి కట్టుకొని ఊరేగుతానట, నేను దేని కైనా వాళ్ళయింటికి వెళితే నన్ను మొగంమీద కొట్టి లేదం టారట. మన కరివేపచెట్టంటే వీళ్ళకెందుకూ యింత ఉడుకు మోతుతనం. వీళ్ళందరి దృష్టి తగిలే అది యెండిపోయింది. అయినా వాళ్ళనేమీ అనకు. వాళ్ళతో మనకు తగాదా యెం దుకు? నాతర్వాతకూడా ఆచెట్టును మీ అమ్మకు మాగుగా చూచుకుంటూ ఉండండి" అన్నాడు రామారావు.

సూరమ్మకు నోట మాట రాలేదు; తమ యింట్లో జరి గిన సంభాషణంతా యీయన విన్నాడని ఆమెకుదోష్యతికమైంది. అంతదాకా యెందుకు వాదించానా అని విచారపడింది. ఇప్పుడేంచేస్తుంది. పాపం ఆయన కెలావుంటుందో అని దిగులు పడింది. బిక్కమొగం చేసుకుని యింటికి పోయింది. సుబ్బా రాయుడుగారుకూడా కాస్తసేపైనతర్వాత యింటికి పోయి

నాడు. ఎలా తెల్లవారుతుందా అని యింట్లోవాళ్ళంతా ఆదుర్దాగా పడుతున్నారు. శకుంతలమ్మ మొక్కుకుంటూ అల్లాగే మంచం పక్కన కూచుని ఉంది. మిగిలినవాళ్ళు నిద్రరాక ఆదుర్దాతో పడుకునే ఉన్నారు.

తెల్లవారింది. రామారావు కొంచెం కళ్ళుమూసినట్టు కనబడ్డాడు. శకుంతలమ్మ దొడ్లోకి వెళ్ళి కరివేపచెట్టువంక చూచింది. మోడువలె ఎండిపోయి ఉన్నది. కాని తుదిరెమ్మకు చిగురు వేసింది. పిల్లవాడుకూడా వెళ్ళి ఆసంగతి తెలుసుకున్నాడు. ఇద్దరూ లోపలికి మంచందగ్గరికి వచ్చారు. రామారావు కండ్లు మూసుకునే ఉన్నాడు. శకుంతలమ్మ కుంపటి రాజేసి వేడినీళ్ళుపెట్టి ముఖం కడుక్కోటానికి దొడ్లోకి వెళ్ళింది.

మొగం కడుక్కొని వచ్చి చెల్లెలు సుశీలతో "నాన్న లేవగానే ఈసంగతి చెబుదాం" అన్నది శకుంతలమ్మ.

"అక్కా, కరివేపచెట్టంటే నాన్నకు మొదట్నుంచీ చాలా అపేక్ష. ఎన్నడైనా ముట్టుకుంటే నన్నుకూడా కోప్పడేవాడు. దొడ్లో చెట్టుఉన్నా యెప్పుడూ బజారునుంచే తెచ్చుకునేవాళ్లం. చెట్టు ఎండటం మొదలు పెట్టడమేమిటి నాన్నకు జబ్బుచేయడమేమిటి" అన్నాడు పిల్లవాడు, కృష్ణమూర్తి.

"ఏదో రహస్యం ఉంది, నాకు......"

"పెద్దమ్మాయి" అన్నాడు రామారావు.

"నాన్నా అంటూ ఎక్కసపుగున శకుంతలమ్మ మంచం దగ్గిరికి పోయింది.

"మీ అమ్మను యిలాపిలు"

"ఏమిటినాన్నా, అలా అంటావు?"

"న్నాట్లో మీా అమ్మ మాట విన బడుతున్నదిగా"

ఇంటిల్లిపాదీ మళ్ళీ మంచం చుట్టూ మూగారు. శకుంత లమ్మ గుండెల్లో రాయి పడ్డది.

"నాన్నా నేను నీకు మంచిమాట వకటి చెబుతా గానీ అలా మాట్లాడ కుండా ఉంటావా?" అన్నది శకుంతలమ్మ, కళ్ల నీరు వత్తు కుంటూ.

"అలాగే"

"కరివేప చెట్టు చిగురు వేసింది."

"ఆ, నిజమా ? ఎంత అదృష్టం! నన్నొకమారు చూడ నియ్యవా" అంటూ లేవ బోయినాడు.

"నాన్నా ! నీవు మొగం కడుక్కుని కొంచెం పాలు తాగు. నేను చూపిస్తాను"

"అయితే నీళ్లు తీసుకురా" రామారావు మొగం కడుక్కుని, ఎన్నడూ విసుక్కుంటూ తాగేవాడు గుటుక్కు గుటుక్కున తాగినాడు పాలను!

పిల్లవాడు మారామాము చేసినట్టు "నాకు కరివేప చిగురు చూపవా అమ్మాయీ" అంటూ పోరాడు.

తోడల్లుండిద్దరూ వచ్చి మంచం తలుపు దగ్గిరకి తెచ్చి పెట్టారు. అక్కడికి కరి వేప చెట్టు కనబడుతోంది. తుది రెమ్మ వంచి శకుంతలమ్మ రామా రావుకి చూపింది. ఆయనకు కండ్ల నీరు తిరిగినై.

"ఒక్క మారు ఆ చిగురును ముద్దు పెట్టుకో వలెనని ఉంది. చేత కాదు కదా!" అంటూ అక్కడే మంచం ఉంచమన్నాడు రామా రావు. చెట్టు చివర నున్న చిగురు చూస్తూ తన్మయుడై పోయాడు.

శరీరం నెమ్మదిగా నయమైంది. అంతా వాళ్ల యిండ్లకు వెళ్లారు. చెట్టు మానై పెరిగింది!

ఎన్నడూ ఎవ్వరూ కరి వేపా కడిగ లేదు!!

రామా రావు దాని కిందే మంచం వేసుకుని పడుకునే వాడు!!!

[జమ్‌షెడ్‌పూర్ నుంచి వెలువడే "ప్రవాసి" అనే మాసపత్రికలో, డిసెంబర్ 1947లో ఈ కథకానికథ పూర్వం ప్రకటింపబడింది.]

# ఆమె గతి ?

నారాయణరావుగారికి విశాల యేకపుత్రిక. ఆయన కామె అపరవయస్సులో పుట్టడంచేత యెక్కడాలేని ప్రీతి. అల్లారుముద్దుగా చూచుకుంటున్నాడు. ఆయన తప్పక స్త్రీలకు విద్య యివ్వాలనే కోటెలోవాడు. అంచేత విశాలను, బళ్లోకి పంపాడు. విశాలకూడా ప్రతీక్లాసు ఫస్టుగా ప్యాసౌతూవచ్చింది. ఆయన డిస్ట్రిక్టు కలెక్టరుకాబట్టి ఎప్పుడూ హైస్కూలున్న వూళ్ళోనే వుండేవాడు. విశాల 5 వత్సరంలోకి వచ్చింది. 14 వయేడు. శారదాచట్టాన్నుల్లంఘించడాని కాయనకు వీలు లేదుకదూ? అంచేత పెండ్లాము బలవంతపెట్టినా 14 వయేడు నిండిందాకా ఆగాడు. తరువాతనే పెండ్లిప్రయత్నము మొదలెట్టాడు.

శ్రీనివాసరావుగారొక జాగీర్దారు. సాలుకు 30 వేల రూపాయ లొస్తాయి. ఒక్కడే ఒకకొడుకు రామారావు. మంచిరూపసి. బుద్ధిమంతుడు. చదువులో కూడా యెక్కివచ్చాడు. ఇక బి. యే పరీక్ష మూడుమాసాలుందనంగా పాపము శ్రీనివాసరావు గారు కాలంచేశారు. అయినప్పటికీ తెలివిగలవాడవుటచేత రామారావు దుఃఖంలో వుండీకూడా పరీక్ష నెగ్గాడు. తల్లిమాట ప్రకారము వుంటూ జాగీరులో ప్రజలందరిప్రేమకూ పాత్రుడై ఇంటివద్దనే ఉన్నాడు. ఉద్యోగంచేసే వుద్దేశమే లేదు. ఓనాడు తల్లి "అబ్బాయి పెండ్లి మాటేంచెప్పావు?" అంది.

"ఇదివరకే నావుద్దేశం చెప్పానుకదూ?"

"గుంటూరులో డిస్ట్రిక్టుకలెక్టరు నారాయణరావుగారట! మొన్న మీ మామయ్య దగ్గరికి కబురంపారట! నిన్న

మామయ్యొచ్చి నాతో చెప్పాడు.''

"ఏమేనా చదువుందా పిల్లకు?"

"ఫిఫ్త్ ఫారమేదో చదువుతూందట! అయినా ఆడపిల్లకంత చదువెందుకులే!''

''చదువుకోని పశువుని చేసుకోమంటావా యేమిటి?''

''అబ్బాయీ! నాకు తెలియక అడుగుతాను గాని ఆడవాళ్ళకు ఇంగ్లీషు చదువెందుకురా?"

చదువుతూందని చెప్పింది కాబట్టి తల్లితో యిక చర్చించ తలుచుకోలేదు రామారావు. మామా అల్లుడూ వెళ్ళి పిల్లను చూశారు. పిల్ల నచ్చింది పిల్లాడికి. పిల్లాడు నచ్చాడు పిల్లకి. ఒకరినొకరు పలుకరించి మాట్లాడారు. పెండ్లి యేప్రిలు నెలలో అయింది. గుంటూరులోనే అతి వైభవంగా!

రామారావు అత్త వారింటికి వస్తూవుండేవాడు. విశాల రామారావులు చిలకా గోరింకల్లాగా యింట్లో తిరుగుతూంటే నారాయణరావుగారికి చాలా సంతోషంగావుంది. వాళ్ళకికూడ ఒకరిమీద ఒకరికి ప్రేమ క్రమాభివృద్ధిపొందుతూ వుంది. విశాల స్కూలుఫైనలు ప్యాసైంది. వ్యక్తురాలు అయింది. రామారావు సరేనని ఒప్పుకున్న మీదట విశాలను చెన్నపట్నం యింటర్మీడియేటుకు పంపారు. "క్వీనుమేరీస్ కాలేజీ''లో చేరింది. ఇంటర్మీడియేటు రెండేండ్లు అయినది. ఫస్టుక్లాసులో ప్యాసైంది. తండ్రికీ, భర్తకు మిక్కిలి సంతోషమైంది. సెలవల్లో విశాలా రామారావులు గుంటూరులోనే ఉన్నారు. నారాయణరావు గారికి సర్వీసుపూర్తి కావటంచేత పించన్ తీసుకున్నాడు.

"నాన్నా వచ్చే సోమవారం కాలేజీ తెరుస్తారు. వెళ్ళక పోతే సీటుదొరకదేమో?" అన్నది విశాల.

"అయితే నీభర్త నడిగావా?"

"వాళ్ళమ్మకు ఎంతమాత్రం యిష్టంలేదట! కాని తన కభ్యంతరం లేదని చెప్పారు."

"నాదేముంది? నీఅత్త వారి సంగతి మాత్రం చూచుకో. చెప్పాడుగా అక్కడున్న సంగతి"

విశాల బి. యే.లో చేరింది. నారాయణరావుగారు కూడా గుంటూరులో యిల్లు అద్దెకిచ్చి చెన్నపట్నంలోనే చేరాడు. రామారావు మాత్రం ఇంటిదగ్గరే ఉండిపోయాడు. విశాలా రామారావులకు మాత్రం ఉత్తరాలు నడుస్తూనే ఉండేవి.

"ఏమిరా, అబ్బాయి ఎంతకాలమురా నీ పెండ్లాము చదువు?"

"చదువుకుంటే తప్పేముందే అమ్మా?"

"అంతులేదట్రా చదువుకి? ఏం, ఉద్యోగాలు చెయ్యాలా వూళ్ళేలాలా?"

"నీ కొడుకూ, కోడలూ బి. యే లైతే నీకు సంతోషం కాదే అమ్మా?"

"చట్టుబండలు!! నే బ్రతికుండగా అదివచ్చి యీ యింట్లో తిరగటం, నీ కడుపు నోకాయ కాయటం జరిగేట్టు కనపళ్ళేదు."

రామారావు మరి మాటాడలేక పోయాడు. పాపం

రామారావుతల్లి యీసంభాషణ జరిగిన నెల దినాలకల్లా చని పోయింది. మామగారి కీ సంగతి తెలియపరచాడు. అత్త మామలు వచ్చారు. విశాలకు యిక పరీక్షలు ఒకనెల ఉండటం చేత రావటానికి వీలులేక పోయిందన్నారు. రామారావుకు మనస్సు కొంచెము చివుక్కుమన్నది. కర్మాంతరాలై పోయాయి. నారాయణరావుగారు, భార్యా మళ్ళీ పట్నం చేరారు. తర్వాత నాలుగయిదు దినాలకి విశాల కీ కింది వుత్తరం వచ్చింది.

"శ్రీనివాసపురం
౧౫-౧-౨౮

ప్రియా !

నీ ఉత్తరము అందింది. కర్మాంతరాలకు నీవు లేవని యెంతమాత్రము నా మనస్సులో లేదు. కాని మాయమ్మ పోయినతర్వాత నా మనస్సు వెనకటట్లే లేదు. ఇల్లు శూన్య మైంది, నీవొచ్చి యీయింట్లో రాణివై తిరుగుతుండాలని తోస్తున్నది. మార్చితో బి. యే పరీక్ష అయిపోతుందికాబట్టి యీ విషయాన్ని కొంచెము మనస్సులో పెట్టుకో. మీనాన్న గారితో సంప్రతించి ప్రత్యుత్తరం రాయి వెంటనే.

— ప్రియుడు రామారావు.

ఈ వుత్తరం చదివేటప్పటికి విశాల హృదయంలో భిన్నభిన్న భావాలన్నీ ఉత్పత్తి అయినాయి. రామారావు మీద తనకు ప్రేమఉన్నా తా నాయనకు భార్యనేకదా అని జ్ఞాపకమొచ్చింది. పెండ్లెందుకు చేసుకున్నానా అని పశ్చా

త్రాసం కలిగింది. తన చదువు కంతరాయం కలుగుతున్నదే అని ఓ వైపున ఎంత చదువుకున్నా ఓ మొగాడికి దాసీతనం చెయ్యటమేకదా ఆడదానికర్మం అని మరోవైపున బాధించటం మొదలెట్టాయి. అనుస్యూతంగావచ్చే ఆచారాలమీద అసహ్యం కలిగింది. వాటిని తిరస్కరించడానికి ధైర్యంలేదు. కాని ఆడదాని అస్వతంత్రత, అందువలన వచ్చిన నైచ్యము మనస్సును కలత పొందించాయి. ఇంతటితో చదువు కట్టిపెడదామా అంటే మనస్సొప్పటంలేదు. వీటి అన్నింటిమీద రామారావుస్థితి చిత్తవృత్తి జ్ఞప్తికొచ్చాయి. హృదయం చలించింది. తన కత్యంత ప్రియుడైన రామారావు కష్టపడుతున్నాడే అని చింతించింది. కాని తనకుమాలిన ధర్మముండదు కాబట్టి తనచదువు తన స్వాతంత్ర్యము అన్న ఊహ అన్నిటిని కమ్మింది. తుదకు యేమైనాసరే తనకు స్వార్జనంచేసుకునే శక్తి వచ్చిందాకా తప్పక చదవవలసిందేనని నిశ్చయించింది. ఈపని రామారావుకు కోపమురాకుండా చెయ్యాలి. ఎట్లాగా అని ఆందోళనతోనే రాత్రిఅంతా గడిచింది. ఒకటి, రెండు, మూడు, నాలుగు కొట్టింది గడియారము. నిద్రపట్టలేదు. తుదకు బల్లమీదవున్న కలము తీసుకుని యీవిధంగా రాసింది.

లాయడ్ రోడ్డు, మద్రాసు,

౧౬-౧-౩౦.

నమస్కారములు!

మీ ఉత్తరం నామనస్సును కలిచేసింది. నాకు మార్చి ౨౧ వ తేదీలో పరీక్షలు అయిపోతాయి. అప్పటికి మీరు తప్పక యిక్కడికి దయచేయండి. ఇంకా తొందరగావస్తే

ఇంకా సంతోషమే. నా హృదయం తమతోనే నిండియున్నది. మీరిక్కడి కొచ్చినప్పు డన్ని సంగతులు మనం మాట్లాడి నాన్నతో కూడా సంప్రతించవచ్చు. వెంటనే మీ శరీరారోగ్యము, చిత్తవృత్తి రాయండి. మీ ఉత్తరం చూచిందాకా నాకేమీ తోచదు.

– ప్రియురాలు విశాల.

విశాల నెప్పుడు తన యింట్లో సంచరిస్తూవుంటే చూదామా అని ఉవ్విళ్ళూరుతున్న రామారావుకు ఉత్తరం వచ్చిందనేటప్పటికి మనస్సు తత్తరించింది. ఉత్తరం విప్పటానికి చెయ్యి వణికింది. ఉత్తరంలో తాను రాసినదానికి సరియైన జవాబు రాయలేదే అని కొంచెం కోపం వచ్చింది. కాని పాపం విశాల తనయెడల అన్యథా వర్తించదన్న నమ్మకం కోపాన్ని పోగొట్టింది. ఓమూల యెందుకు చదువుకున్న పిల్లను పెళ్ళాడానా అని చింతపొందాడు. తుదకు మించింది లేదు; చెన్నపట్నం వెళ్ళి సంగతులన్నీ నిర్ధారణ చేసుకుందామని మనస్సు కుదుర్చుకున్నాడు. ఇంకా దాదాపు రెండు నెలలు ఆగాలి. రెండునెలలు రెండేండ్లుగా కనబడుతున్నాయి. ఇప్పుడే పోదామూఅంటే, యెందుకు అనవసరం. పరీక్ష చదువులో మునిగిఉంటుంది విశాల. మనసానాను ఈ క్రిందివిధముగా రాసి పోస్టులో వేశాడు.

ప్రియా!

నీవు రాసిన ప్రకారం నీ పరీక్ష లయ్యేటప్పటికి నేను అక్కడికి రాగలను.

ఇట్లు
రామారావు.

ఈ సంగ్రహా లేఖ విశాలకు దుఃఖము కల్గించింది. స్వయంకృతాపరాధం! ఏమనుకునీ యేంలాభం లేదు. మనస్సు నిశ్చలం చేసుకుని పరీక్షకు గట్టిగా చదవటం మొదలు పెట్టింది. తప్పక ఫస్టుక్లాసులో ప్యాసవుతుందని, తమ కాలేజికి గౌరవం కలుగుతుందని ప్రొఫెసర్లంతా అనుకున్నారు.

ఇట్లా వుండగా ఇకపరీక్ష 15 దినా లుందనగా విశాల తండ్రి ఒక బస్సుప్రమాదంలో అకస్మాత్తుగా చనిపోయినాడు. విశాలా, తల్లీకూడా దుఃఖసముద్రంలో మునిగారు. వెంటనే రామారావుకు టెలిగ్రాం యిచ్చారు. మరునాడు రైలులో రామారావు వచ్చాడు. కరోనరు (Coroner) విచారణ్తై బస్సుప్రమాదంవల్ల చనిపోయినట్లు తీర్పు చెప్పి శవాన్ని యిచ్చే శారు. దహనాదిసంస్కారా లయినాయి. పాపము విశాలకు తనదుఃఖమేగాక తల్లియేడ్పు కూడాను. చదువేం సాగుతుంది? కర్మాంతరాలయిన మూడుదినాలకే పరీక్ష. రామారావు యింట్లో ఉన్నాడనే ధైర్యంతో విశాల పేపర్లు రాయకల్గింది. మొగుడుపోయినా, కూతురు, అల్లుడుయింట్లో వున్నారుకదా అని ముసలమ్మకూడా మనస్సు కుదుర్చుకుంది.

పరీక్షలు అయి పోయాయి. అందరూ కూడా దుఃఖాన్ని కొంచెం కొంచెముగా మరుస్తున్నారు. ముసలమ్మకూడా చేసేదేం లేదని, పిల్లలు సుఖంగా ఉంటే చాలని ఊరటపడ్డది. ఇట్లా వుండగా ఓరోజున విశాల యినప్పెట్టెలో కాగితాలు వెతుకుతూంటే అందులో ఓస్టాంపుకాగితం కనబడ్డది. రిజష్టరి కూడా చేసినట్టేవుంది. కొంచెం చదివేటప్పటికి విశాలకు కండ్లకు నీళ్ళొచ్చాయి. తల్లి ఆసంగతి చూసి——.

"అమ్మాయీ, యెందుకే కండ్లనీరు కారుస్తున్నావు" అని అడిగింది. విశాలకు నోటమాట రాలేదు. ఇంతలో రామారావు వచ్చాడు. విశాల కాగితము రామారావు చేతి కిచ్చింది. రామారావు చదివి "ఇది మామగారి విల్లండి అత్తగారూ" అన్నాడు.

"తమరు విల్లు రాసినట్లు వారు నాకెప్పుడూ చెప్పలేదు; రాశారు కాబోలు!" అన్నది, ముసలమ్మ కళ్ళొత్తుకుంటూ. ఈమె మొదటి నుంచీకూడా వ్యవహారంలో జోక్యం కలుగ జేసుకొనేది కాదు. విల్లులో నారాయణరావుగారు తన యావ దాస్తిని ఉదాహరించారు. ఇల్లుతప్ప స్థిరాస్తి లేదు, మిగిలిన దంతా బ్యాంకులో రొఖ్ఖంగానే వుంది. నారాయణరావుగారు లంచాలు యేమాత్రం పుచ్చుకొనేవాడు కాదు. ఆయనఆస్తి అంతా కష్టార్జితం. జీతంలోనుంచి ఆదా చేయబడిన బాపతు మొత్తం 60 వేలకు ఉంది. అందులో భార్యకు 5000 ఆమె యిష్టప్రకారం చేసుకునేటట్లు రాశాడు. కూతురికి 10, 000 ఆమె యిష్టప్రకారం రాశాడు. గుంటూరులో వున్న ఇల్లు మాత్రం అల్లుడికి ఇచ్చాడు. మిగిలిన ఆస్తి అంతా విశాలా రామారావులకు పుట్టే సంతానానికి చెందేటట్లు రాసి వుంది. అట్లా సంతానం కలగకపోతే సంతానం పుట్టే వయస్సు మీరిన తర్వాత విశాలా రామారావులు తమ యిష్టమువచ్చి నట్టుగా చెరి సగము ఉపయోగించుకోవచ్చు. ముసలమ్మ అంతావిని నిట్టూర్పు విడిచి "కుటుంబం నిలవడానికి ఏమీ చేయలేదు." అంటూ రెండు అశ్రుబిందువులు కార్చింది. మళ్ళీకాగితాన్ని మడిచి పెట్టెలో పెట్టారు. ఆస్తికంతకూ తన్ను అధికారిగా

చేయలేదే అని విశాలకేమైన అంతస్సులో ఉన్నదేమోకాని పైకిమాత్రం కన్పరచలేదు.

నెలగడిచింది. విశాల పరీక్షప్యాసైనట్టు తెలిసింది. అందరూ సంతోషించారు. సుందరమ్మ కూడా చదువుకున్న కూతుర్ని, అల్లుణ్ణి చూచుకుంటూ సంతోషిస్తూనే ఉంది. ఆమె మనస్సు పరీక్షచేస్తే వాళ్ళు యిద్దరుకూడా ఉద్యోగంచేసి సంపాదించ నవసరంలేదు. కాబట్టి ఇక సుఖంగా యింట్లో కాపురంచేస్తూ సంతానాన్ని కని ముద్దుముచ్చట్లు జరుపు కుంటూ తాను జీవించినంతకాలం గడపాలని ఉంది. ఓనాడు ఈ అభిప్రాయాన్ని సూచిస్తూ కూతురితో "అమ్మాయీ ఇద్దరూ చదువుకున్నారు. వయస్సు వచ్చింది. ఈ ప్రాంతాల్లో వుండనవసరంలేదు. కాబట్టి గుంటూరువెళ్ళి మనం యిల్లు బాగుచేసుకుని ఉండిపోదాం. నీవు అన్నీ తెలిసినదానివి కాబట్టి నేనెక్కువగా చెప్పనక్కరలేదు." అన్నది.

విశాల బదులేమీ చెప్పలేదు. విశాలా రామారావులు అన్యోన్యంగా ఉన్నారేకాని యింతవరకు దాంపత్యధర్మాలు లేవు వారిమధ్య. ఈసంగతి తల్లికితప్ప యెవ్వరికీ తెలియదు. రామారావు మనస్సు నిగ్రహించుకొని కాలం గడుపు తున్నాడు. సుందరమ్మకు కూతురిప్రవర్తన బోధపడటంలేదు. విశాలమనస్సులో యేముందో యెవ్వరికీ తెలియదు. ఇద్దరూ కలసి బీచికి పోతూనేఉండేవాళ్ళు. రామారావుకు అనేకమార్లు బీచి యిసుకలో వెన్నెలరాత్రి ఆమెను కౌగిలింతామా అని బుద్ధిపుట్టేందికాని, ధైర్యం చేశాడు కాదు. రెండునెలలు అయిన తర్వాత ఓనాడు బీచిమీద యిద్దరూ నీళ్ళకు దగ్గిరగా కూచు



విశాల వేలుతో తడి యిసుక కెళ్లగిస్తూ............

న్నాను. చుట్టుపక్కవాళ్లల్లో కొందరికళ్ళు నీళ్ళమీాదే ఉన్నాయి. కొంచెము సంధ్యచీకటి పడ్డది. ఇద్దరికి ౨-౩ అంగుళాల యెడంతప్ప లేదు. విశాల వేలుతో తడియిసుక కెళ్ళగిస్తూ—

"నేనోమాట అడుగుతాగానీ, దాచకుండా సమాధానం చెబుతారు?" అన్నది.

"విశాలా, నీయడలా దాపరికము?"

"నాపైన మీాకు కోపము లేదుగదా?"

విశాల ప్రశ్న అడిగినరీతి బహుహృదయంగమముగా కనిపించింది రామారావుకు. ఆలస్యంచేస్తే ఆలోచిస్తున్నాడనుకుంటుందని, "కోపానికి కారణమేముంది విశాలా?" అన్నాడు. చిన్నబుచ్చుకున్న విశాల ముఖం వికసించింది చిరునవ్వుతో. "మీారు ఉత్తరంలో రాసిన విషయాన్ని గూర్చి ఆలోచించటానికి యింతవరకు సావకాశం లేకపోయింది. సంగతులన్నీ అవ్యవధానంగా జరిగిపోయినాయి. ఇప్పుడిప్పుడే మనస్సు కొంచెం శాంతిస్తున్నది. ఆసంగతులు మనం మనస్సు విప్పి మాట్లాడటానికి యిప్పుడు మీా కిష్టమేనా?"

రామారావు మనస్సు వక్కగం తేసినట్లయింది. "నా సంగతి నాకిష్టమా అని అడగాలా విశాలా?" అన్నాడు.

"మీాకు నాయెడల సంపూర్ణానురాగం ఉందని స్పష్టాం తమక్కరలేదు. ఆసంగతినాకు నిశ్చయమే ! నాకుమనస్సులో తమరు తప్ప యితరపురుష బింబం లేదని, సముద్రుడు ప్రమాణంగా మనవి చేస్తున్నా. మీాకు నమ్మకమేనా !"

"ఆమాట నన్నడగాలా విశాలా!"

"నేను మిక్కిలి ధన్యను"

"నేనుకూడా అట్లాగే అనుకుంటున్నాను."

ఇద్దరి చేతులూ అప్రయత్నంగా కలిశాయి. ఇదే పెళ్ళి అయిన తర్వాత రెండో కరగ్రహణం. ఇద్దరూ స్పర్శసుఖం అనుభవించినట్టి దృష్టాంతంగా యిద్దరికీ కొంతసేపటిదాకా నోట మాటరాలేదు. విశాల దోవలోకి వస్తున్నదనీ, తన ఆశ ఫలించేదినం వచ్చిందనీ రామారావు లోలోపల సంతోషిస్తున్నాడు. కొంతసేపటికి విశాల—

"మీ ఉత్తరంలో రాసినట్టు యింకా కొన్నాళ్ళదాకా చెయ్యక చదువుకుంటే మీచిత్తం మారి నాపైన ఉన్న ప్రేమ కేమైనా భంగం కలుగదుకదా?" అన్నది.

రామారావు నిర్ఘాంత పడిపోయినాడు. నోటమాట రాలేదు. ఆశాహర్మ్యం ఒక్కమారు గుభాలున కూలింది. అనేక ఆలోచనలు ఒకటితర్వాత ఒకటిగా గిర గిర తిరుగుతు న్నాయి. తుదకు 'నీ యిష్టం అట్లాఉంటే నేను చేసే దేముంది?' అన్నాడు.

కొంచెము చీకటి వ్యాపించింది. బీచికి వచ్చిన వాండ్లంతా లేవడం మొదలు పెట్టారు. విశాలా రామారావులు కూడా లేచి సాగారు. ఏమీమాట్లాడకుండానే యిల్లు చేరారు. ఇద్దరి మనస్సులూ ఆందోళనతో నిండి పోయినాయి. భోజనం ముందరకూడా మాట్లాడలేదు. రామారావు చేయికడుక్కొని "విశాలా, బడలికగాఉంది. నేను పోయి విశ్రమిస్తాను"

అన్నాడు. విశాల యేం మాట్లాడలేదు. ఇదంతా చూస్తున్న సుందరమ్మకు కొంచెము అనుమాన మేసింది.

రామారావుకు నిద్రరా లేదుకదా, పైపెచ్చు మనసు ఆలోచనతో నిండి పోయింది. "చదువుకున్న దిచాలదూ? అంటున్నదీ? వివాహానికి పరమావధి యేమిటో యింత చదువుకున్నా తెలియలేదే? కామాంకురం కాలేదా? విపరీతంగాఉందే? లోకాన్ని చూచైనా గ్రహించ లేక పోయిందే! వాళ్ళనాన్నగారి పవిత్రాభిప్రాయంకూడా యీమెకు నచ్చలేదే? నామాటే తోసిరాజన్నప్పుడు యిక వాళ్ళమ్మ మాటంటే వింటుందీ? మాఅమ్మ చెప్పినట్టే అయింది! పోనీ నామెడల ప్రేమ లేదా అంటే అట్లా అనటానికికూడా వీలులేదే! సాయంకాలమేగా ప్రమాణం చేసింది. విశాల యెప్పటికి ముఖప్రీతి మాట ఆడదు పోనీ, నేను మరోవిధంగా ప్రవర్తిద్దామా అంటే మనస్సంతా విశాలతోనే నిండిఉందే? మరియొక స్త్రీని స్పృశింపజాలను! "నాతి చరామి" అని బాసకూడా చేస్తినే! దానికి విపరీతంగా ప్రవర్తించి ఇహపరాలకు దూరుణ్ణికానా? ఛీ నాతుచ్ఛసుఖము!! ఇద్దరూ చెరోవేపుకు లాగితే సంసారం వీధిలోనే! కాబట్టి నా అభిప్రాయప్రకారం ఆమె చేయకపోతే ఆమె యిష్టప్రకారం చెయ్యటం నా విధి" అనుకుంటూ ఇద్దరి అభిప్రాయాల మంచి చెడ్డలను పరీక్షచెయ్యటం ప్రారంభించాడు. "స్వసౌఖ్యం నా ఉద్దేశం. విద్యార్జనం ఆమె ఉద్దేశం. రెండిటిలో విద్యార్జనం పవిత్రతరం. కాబట్టి పవిత్రతరమైన విద్యార్జనంకోసం తుచ్ఛమైన నాసౌఖ్యం వదిలడం కర్తవ్యం" అనుకుంటూ మంచం మీద వెల్లికలా పడుకొని ఆలోచిస్తూ వుండగా తలుపుతట్టి

సల్లైంది. రామారావు లేచి తలుపుదగ్గరికి వెళ్ళి "విశాలా" అన్నాడు. "తలుపు తియ్యండి" అని వినబడ్డది తలుపు తెరిచి విశాల లోపలికి వచ్చింది. రామారావు మంచంమీద కూర్చు న్నతర్వాత పక్కనున్న కుర్చీమీద తాను కూర్చున్నది. ఆమెముఖం చూస్తే ఆమెకుకూడా నిద్రగాలేదనీ, మనస్సు ఆందోళనతో నిండి వుందనీ చెప్పక చెపుతూవున్నది.

"ఏం నిద్రగా లేదా విశాలా?"

"నాకుకూడా మనస్సు లేదనుకున్నా?"

"మీఅమ్మ నిద్రపోయిందా?"

"ఆసంగతి చూచే యిట్లావచ్చా. సాయంకాలము మీ మనస్సుకు కష్టం కలిగించానని తోచి, క్షమాపణ చెప్పడం దానాసి మనస్సు తత్తరపడుతున్నది. నన్ను మీరు క్షమించా నంటేనే గాని నామనస్సు కుదుటపడదు." అంటూ రామా రావు రెండుకాళ్ళను రెండుచేతులతో పట్టుకున్నది. రామా రావు కరిగి నీరైపోయాడు. మరొకడైతే "అతివినయం" అను కునేవాడే. కాని రామారావు ఆమెహృదయం బాగా తెలిసిన వాడు కాబట్టి ఆమె ప్రవర్తనలో ఆయనకు ఆర్జవమే కనపడ్డది.

"నీవేం తప్పుచేశావని క్షమించడం విశాలా పిచ్చిదానా! లే" అంటూ విశాల లేవడానికి చేయూత ఇచ్చాడు. విశాల లేచి కూచుంది. ఇంకా మాట్లాడడానికి తగిన మనస్థైర్యం చిక్కలేదు.

"నాకుకూడా యిందాకటినుంచీ ఆందోళనగానే ఉంది. ఆలోచించగా తుదకు నా తుచ్ఛసుఖంకంటె నీవుద్దేశం పవిత్ర

మైందని నిశ్చయించా" అన్నాడు రామారావు.

"నాకుకూడా సరిగా నా ఉద్దేశం అట్లాగేతోచింది."

"జ్ఞానసంపాదనం పవిత్రకార్యం గాని అందులో స్వార్థమేముంది విశాలా?"

ఎప్పుడైతే తనతో ఆయన యేకీభావం అవుతున్నట్టు కనబడుతున్నదో ఆమెకు కొంచెం ధైర్యం వచ్చింది. ఇదే సమయం తన అభీష్టం నెరవేర్చుకోటానికని తోచింది. కాని ఆయన అభీష్టం బొత్తిగా తోసేసి తన అభీష్టం నెరవేర్చుకోటం సమంజసం కాదనుకున్నది. రెంటిని నెరవేర్చడం సాధ్యమైనంత వరకు మంచిదని ఆలోచించి,

"నేను మెడికల్ కాలేజీలో చేరుదామని ఉంది. మీ సహౌదార్యాన్ని కనిపెట్ట జాలనంత మూర్ఖురాలను కాను. మీరు వద్దనరనీ, నా అభీష్టం నెరవేరుస్తారనీ నాకు తెలుసు. కాని మీ అభీష్టం బొత్తిగా నెరవేర్చక పోవడం తప్పని నా అంతరాత్మ చెప్పుచున్నది. కాబట్టి........"

"నా విషయమై నీ వెంతమాత్రం ఆదుర్దా పడవద్దు. పురుషుడు పశువు. నీ వేమిచేసినా నాకు సంతోషమేనని నాతోడుగా చెప్తున్నా."

విశాలకు తన భర్తయొక్క ఆత్మపరీక్ష ఆశ్చర్యం కలిగించింది. అట్టివాణ్ణి భర్తగా బడసినందులకు తన్నభినందించుకుంది. అట్టి నిష్కళంక ప్రేమను తాను పరీక్షిస్తున్నందుకు తన్ను తాను నిందించుకున్నది. తన విద్యాభ్యాసంకూడా వదిలేదామా అనందాకాకూడా అభిప్రాయం పోయింది. కాని

తనకు ఆర్థికస్వాతంత్ర్యము వస్తేనేగాని పురుషుడితో తనకు సౌఖ్యం రాజాలదనే నమ్మకంచేత వదిలేయ బుద్ధిపుట్టలేదు. "నా మనవికూడా కొంచెము చిత్తగించండి."

"నీవు అంతగా చెపుతానంటే వినకపోవటం తప్పు. ఏదీ కానీ! చెప్పు" అన్నాడు తుదకు.

"ఇక వారం దినాలలో మెడికల్ కాలేజ్ తెరుస్తారు. కాబట్టి యీవారం వినా యిష్టప్రకారం......" విశాల తల వంచుకున్నది. ఈమాటలు వినేటప్పుడు రామారావు మనస్సులో ఒకటివెంట వకటిగా రెండు ఊహాలు తట్టాయి. ఆమె యిష్టము చెప్పనైతే ఆమెతో సంసారసుఖ మనుభవించ డానికి తానింకా యెన్ని సంవత్సరాలు కనిపెట్టుకుండాలో, మొదటిది ఏ యేండ్లు!! తన సౌఖ్యంకొరకు ఆమె యెంత జేలైనది రెండవది. తన యెడల ఆమెకున్న ప్రేమ యెంతో ఆమె ఆత్మార్పణంవల్ల తెలిసింది. తన ఆశ మిక్కిలి తుచ్ఛమైందని నరి ధృఢమైంది అతని మనస్సులో. ఆయనయొక్క స్వార్థత్యాగోద్దేశం గట్టిపడింది.

"విశాలా! అంతికక్కుర్తి అనవసరం. నన్నంత తుచ్ఛుణ్ణిగా తలచవద్దు" అంటూ ఒక్కమారు విశాల కుడిచేయి తీసుకుని దానిని తన పెదవులకు తాకించుకున్నాడు. విశాలకు పట్టరాని ఆనందం కలిగింది. కాని తన జేలతనానికి సిగ్గుపడ్డది. రామారావు కార్యదీక్షకు ఆశ్చర్యం పొందింది. పురుష హృదయంకంటె స్త్రీ హృదయం మృదువైందని ఆమెకప్పుడు గోచరమైంది. కాని రామారావు చూపిన ఔదార్యానికి తాను చేయదలచుకున్న త్యాగము బహు స్వల్పమైందని

కూడా తట్టింది. కొంతసేపు నిరుత్తరయై తలవంచుకుని కూచునే వుంది. కొంతసేపటికి, "స్త్రీకి ఆర్థికస్వాతంత్ర్యం ఉంటేనేగాని భార్యాభర్తలు సమానప్రతిపత్తిగా ఉండజాలరనే నేను మొదటనుంచీ అనుకునేదాన్ని."

"ఎంతపిచ్చిదానివి విశాలా! ఇప్పుడైనా నీ అభిప్రాయం మారలేదా? నా యావదాస్తి నీ యిష్టప్రకారం చేయనిచ్చి దరిద్రుణ్ణి కావటానికి సిద్ధంగావున్నానే! తండ్రి 10,000 యిచ్చిన తరుణికి ఆర్థికస్వాతంత్ర్యాని కేమిలోటు?"

"మీఆస్తి నాది ఎన్నటికన్నా అవుతుందా? మా నాన్నయిచ్చింది నాచదువుకూ, తర్వాత ఆసుపత్రి పెట్టుకోడానికి సరిపోతుంది"

"ప్రేమపూరితులగు భార్యాభర్తలలో నీ నా భేదముంటుందా విశాలా?" విశాల మాటాడలేదు. తిరిగి కొంత సేపటకి,

"ఆర్థిక స్వాతంత్ర్యములేని స్త్రీ పురుషుడికి బానిసై తన వ్యక్తిత్వాన్ని కోల్పోయి భర్తచేత అర్థాంగిగా గాక ఆట వస్తువుగా తలచబడుతుందని కూడా నేననుకునేదాన్ని"

"పురుషులంత నీచులా విశాలా!"

"తమరు నన్ను క్షమించాలె. పురుషులందరూ తమవంటి వారే అయితే ప్రపంచంస్వర్గమే అనచ్చు!"

"స్త్రీలంతా నీవంటి వాళ్లైతేకూడాను!"

ఈ మాటలన్నప్పుడు రామారావు నేత్రాల్లో ఆయన అంతరాత్మ ప్రతిబింబిస్తూన్నది. మీ నిష్కలంక చిత్తవృత్తిని

తలుచుకున్నప్పుడు మీవంటిఉత్తములకు నేను తగనిదాననని నాకు తోస్తూఉంటుంది'' అంటూండగా విశాల రెండు నేత్రాల లోనుంచి రెండు అశ్రుబిందువులు రాలాయి. తన మనస్సునకు కష్టంకలిగించానే అని విశాల యెంత బాధపడుతున్నదో రామారావుకు గోచరమైంది.

''విశాలా, నీవు ఎంతమాత్రం దుఃఖించవద్దు. నా స్వార్థ పరత్వం జ్ఞాపకం వచ్చినప్పుడు నాకు చాలా సిగ్గుగా ఉంటుంది. సంసారసౌఖ్యం తుచ్ఛం. నీవంటిదానిప్రేమ చాలు.''

ఇద్దరికీ పట్టరాని ఆనందం కలిగింది. నిరుత్తరులై అట్టే ఉండిపోయారు. తరువాత కొంతసేపటికి రామారావు,

''విశాలా, యిక వారందినాల్లో నేనుయింటికి వెళ్ళి పోదామని ఉంది'' అన్నాడు.

విశాలకు ఎట్లాగైనా రామారావును తనవద్దనే ఉంచు కోవాలని ఉంది. కాని దోవ తోచటంలేదు. రామారావుకు మాత్రం తానిక్కడవుంటే మనస్సు చలించి ఆ మెచదువు పాడు చేస్తుందేమో అని ఉంది ఓవైపున. మరోవైపున ఆ మెను చూస్తూ మాట్లాడుతూనైనా యిక్కడ వుందామనికూడా ఉంది. ఇంతలో విశాల—

''మీరు వెళ్ళటానికి మనస్సొప్పటంలేదు. మీరుంటేనే గాని చదువు సాగదు. చిత్తము శాంతంగా వుండదు. ఇంతే గాక ఇద్దరం యిప్పుడు విడిగా చెరోచోట వుంటే లోకులు పలుగాకులు. అపవాదులు పుట్టిస్తారుకూడాను. కాబట్టి మీరి క్కడే ఉండడం ఉచితం. మనస్సును ఊరికే యేమి వ్యావర్తి లేకుండా ఉంచడం కష్టం. కాబట్టి నాకు ఒక్క ఆలోచన తోస్తు

న్నది.” అన్నది. ఆలోచించగా విశాల తర్కం రామారావుకు నచ్చింది. ఇక్కడే వుందామనుకుంటున్న రామారావుకు విశాలమాటలు శ్రోత్రపేయాలుగా ఉన్నాయి. “తప్పక నీఇష్ట ప్రకారం చేస్తా” అన్నాడు.

“మీరు లా కాలేజీలో చేరండి. బియల్. యం. యల్ మొత్రెంటిసు కలసి అయిదేండ్లు అవుతుంది. ఇద్దరం గుంటూరులో ప్రాక్టిసు చేద్దాం?

రామారావుకు విశాల ఆలోచన మిక్కిలి సంతోషం కల్గించింది. సరేనన్నాడు. విశాల కార్యం సఫలమైనందని సంతోషిస్తూ,

(“తెల్లవారుఝాము కావచ్చింది. ఇక మాఅమ్మ లేస్తుంది.” అంటూ లేచింది. రామారావు ‘యిక అయిదేండ్ల దాకా అడగను.’ అంటూ ఆమెను ఒక్కమారు కౌగలించి పెదవులు కలిపాడు. విశాలకూడ కండ్లుమూసుకొని ఆనందం అనుభవించినట్లే కనబడ్డది.)

మరుదినము విశాల మెడికల్ కాలేజీలో చేరింది. రామారావు లా కాలేజీ తెరిచింతరువాత అందులో చేరాడు. సుందరమ్మకుమాత్రం యెంతమాత్రం మనస్సుకు బాగాలేదు.

“వెఱ్ఱిఅల్లుడు దొరికాడు. యెట్లావప్పుకున్నాడో? నాకు మాత్రం ఎంతమాత్రం నచ్చలేదు. వీళ్ళు అయిదేళ్ళు చదివి, ప్యాసై, ప్రాక్టీసుచేస్తూ అప్పుడా సంసారం? అందాకా నేను బ్రతుకుతానో, లేదో? మాకు వీళ్ళుచల్లేగతి కనపడలేదు. సంగతులన్నీ చూస్తే యీ సంసారం సానుకూల మౌతుందని

తోచదు. నేను పెద్దదాన్నైనా, ఎప్పుడో యేవేళో? ఇవాళ విశాలతో చెప్పిచూస్తా. వినకపోయింటా నేను తప్పక పెంచుకుంటా" అని గొణుగుకుంటూ కుంపటి రాజేస్తుండగా అప్పుడే కాలేజీనుంచి వచ్చి చెప్పులువిప్పుతున్న విశాలకు ఆఖరుమాట చెవిన పడ్డది.

"అమ్మా యేమిటే పెంపుడంటున్నావు?"

సుందరమ్మ తలయెత్తి చూచింది. మొదట తన మానస్సు బైటపడ్డదని తట్టిందిగాని తరువాత కుండ పగలగొట్టి నట్టు నిజం మాట్లాడాలని తోచి

"అమ్మాయీ, నీకు తోచదు. ఒకసు చెబితే వినవు. యింకా యెన్నాళ్ళు యీ చదువు? మంచిపనికూడా 'అతి' అయితే దాన్నికూడా పిచ్చిఅనే అంటారు. నీవు నామాటవిని చదువు కట్టిపెట్టు. ఇద్దరూ చక్కగా చదువుకున్నవాళ్ళు. ఇక చదువు కట్టిపెట్టి సంసారం చెయ్యటం నామతం. ౬౦ యేండ్లు వచ్చినతర్వాత చదువుకోక నోట మట్టికొట్టుకోనా అన్నట్టు ౪౦ యేండ్లు వచ్చింతర్వాత యింకా సంసారమెందుకు? నీవు గనక చదువు మానకపోతే నాయిష్టం వచ్చినట్టు నే చేస్తా."

"ఎందుకమ్మా అంతకోపమూ, తొందరానూ? నా డాక్టరుపరీక్ష, నీ అల్లుడి యం. యల్. పరీక్ష వక్కమారు అయిపోతాయి. ఇద్దరంపోయి గుంటూరులో ప్రాక్టీసు చేస్తాము. మీ అల్లుడు సరే అన్నారు. నీకేమే అమ్మా!"

"నాకేమా? అవును. మీనాన్న మీకడుపు ఫలిస్తుందని, మాకిన్ని నీళ్ళు చల్లుతారు అనేకదూ నీకు పెండ్లిచేసింది! విల్లువల్లనే ఆయన ఉద్దేశ్యం స్పష్టమౌతున్నది. ఆయన

ఊపిరితో వుండగా మనమల నెత్తుకుండానే పోయారు. నాగతి కూడా అంతే పట్టించదలచుకున్నావు నీవు. మాకు మొగపిల్ల వాడు లేకపోయినా నీకడుపు ఫలించి దౌహిత్రుడు గతి అవు తాడుగదా అనే ఆశ యీ నీ చదువుతో అంతరించింది. నీ పుట్టినింటిని నిలబెట్టే బాధ్యత నీది."

"అయితే నన్నే మేంచెయ్యమంటే అదిచేస్తాను."

"యేమా? యేం చేస్తావో? నాకున్నవి ముష్టి 5000 రూపాయలు. దానికి పెంపుడెవరిస్తారు?" విశాల కొంచెం ఆలోచించి——

"అయితే అమ్మా! నాకు చదువుకు నెలకు 50 చొ ప్పున 5 యేండ్లకు మూడువేలు అవుతాయి. "నందో రాజా భవిష్యతి." తర్వాత చూదాం, మిగిలిన 7 వేలు నీకిచ్చేస్తాను. నీవు దత్తుచేసుకో. నాకుకూడా పుట్టిల్లని, తమ్ముడని ముచ్చట తీరుతుంది."

సుందరమ్మ ముఖం వికసించింది. "వీళ్ళమీద ఆధారపడే కంటె యిదిబాగా ఉన్నట్టు తోచింది. వీళ్ళకి పిల్లలు పుత్తే మరీ మంచిది. రెండు కుటుంబాలు నిలుస్తాయి, విశాల పింతండ్రిదగ్గిర పిల్లవాడుకూడా వున్నాడు. ఆస్తి కలవాళ్ళు కారు కాబట్టి గంతేస్తూ యిస్తారు. కాబట్టి గట్టి చేసుకుంటే మంచిది. ఒక వేళ విశాల హృదయం మారుతుందేమో?" రామారావుకు పిలిచి ఆరోజునే మరిదికి వుత్తరం రాయించింది. వాళ్ళు సరేనన్నారు. ఒకమాసం రోజుల్లో అంతా సంపూర్తి అయింది. విశాల దగ్గిరవి 7000, సుందరమ్మదగ్గిరివాట్లో 7000, మొత్తం 10,000 లు పిల్లవాడిపేర బ్యాంకులో వాడి మైనార్టీ వెళ్ళిం

తర్వాత వాడికిచ్చేటట్టు వేశారు. ముసలమ్మ తన స్వంతానికి 2000 అట్టిపెట్టుకుంది. పిల్లవాడికి పదోయేడు. మంచిరూపని కూడాను. బుద్ధిమంతుడు. వాడ్నికూడా మైలాపూరులో స్కూలులో వేశారు. వాడికి విఠల్ అని నూతనమైన పేరుంచారు. అంతా అనుకూలంగానే వెళ్ళిపోయింది. రామారావుకు ఈ సంగతంతా చూడగా భార్యమీద ఆదరం హెచ్చింది. ఆమె సాక్షాత్తు దేవతగా కనపడుతున్నది.

దత్తం తర్వాత విశాల ప్రోత్సాహంచేత యీ కుటుంబం వెనకటి యిల్లు వదిలి యింకొక చిన్నయింట్లో ప్రవేశించారు. విశాలలో కూడా అనేకమార్పులు కలిగాయి. సబ్బుబిళ్ళలు, సెంట్లు మానేసింది. రిక్షామానేసి ట్రాంమీద వెళ్ళడం మొదలు పెట్టింది. మొత్తంమీద జీవనంలో నిరాడంబరత్వం వచ్చింది. కొన్నాళ్ళకు రామారావు యీ సంగతంతా గమనించి, ఒకరోజున,

"విశాలా! మాట! నిన్నొకటి అడుగుతాను కోపం రాదుకద"?

"మీమీదనే కోపంవస్తే యికనాబ్రతు కెందుకు?

"నీలో మార్పేదో కనబడుతున్నదే! కారణం చెప్పు విశాలా?"

"మానాన్న హయాంలో యిష్టమొచ్చినట్టు ఖర్చుపెట్టా! ఇప్పుడట్లా వుండటానికి వీలున్నదా? చెప్పండి."

"విశాలా! నీవు నిర్దయురాలవు! నీకు సౌఖ్యంకూర్పలేని నాభాగ్యమెందుకు?"

"నా అభిప్రాయం మీకు తెలిసే మళ్ళీ యిట్లా అంటున్నారు."

"విశాలా, మన ఉభయులలో యీ భేదం పెట్టుకోడం నాకు మిక్కిలి మనస్తాపం కలగజేస్తున్నది."

"పూర్వకాలంలోకంటె పరిస్థితులు మారలేదండి మరి? స్త్రీ స్వాతంత్ర్యం అనేదానికి అర్థంలేదు కాకపోతే"

"అయితే సాధనం నీవు ముట్టవన్నమాట"

"మీకు కోపం యేమాత్రమొచ్చినా ప్రతివిషయంలోనూ మీకు లోబడ్డాననే తలచండి." విశాల యీ మాట వినేటప్పటికి రామారావు పెదవి కొరుక్కున్నాడు. విశాల పైన మరింత గౌరవం హెచ్చింది.

అడిగాడు, "విశాలా, నీకు అయ్యే అన్నిఖర్చులు నన్ను పెట్టనియ్యడం నాకు సంతోషం కలగజేస్తుంది. తర్వాత నీ యిష్టం."

"ఏదో మాటన్నాను కాని అవసరమైతే మిమ్మల్ని అడక్క తప్పుతుందా ఏమిటి?"

"అంతేచాలు, సంతోషం. అవకాశమిచ్చావు."

"నావి 50, అమ్మ 25 ఇస్తానన్నది. 75 లో సంసారం గడపాలి."

"అయితే విశాలా, నాకు రెండు వరాలివ్వాలె."

విశాలకు నవ్వొచ్చింది. "మీరు కోరటం నేను కాదనడమూనా" అన్నది. "సంసారంలో నావి 50 రూపాయలు

చందా వేసుకో, నేనుమాత్రం అప్పనంగా తినడం న్యాయమా? మరోటేమిటంటే! గుంటూరులో యిల్లు మీనాన్న దేకాబట్టి దాని అద్దె నీవు చదువుకు వినియోగించుకో. ఈ రెండూ నీవు కాదనవద్దు."

విశాల మౌనంతో అంగీకరించింది. అప్పటినుంచి రామా రావు గుంటూరులో యింటిఅద్దె విశాలపేర బ్యాంకులో వెయ్యటం మొదలెట్టాడు. తనయీవదాస్తికి గుమస్తాల నేర్ప రచి ఆదాయం తనకు పంపేటట్టు ఏర్పాటుచేశాడు. విఠల్ కూడా మంచి అనువర్తనగా ఉన్నాడు. తెలితేటలుగా చదువు తునే ఉన్నాడని కనుక్కుంటే తెలిసింది. సుందరమ్మకుకూడా పిల్లాడంటే ప్రేమగానే ఉంది. వాడికి మంచి, శబ్రి అంతా విశాలే చూస్తూండేది. సుందరమ్మకు కూతురికి బుద్ధివచ్చి కడుపు ఫలించలేదనే కించ తప్ప యితరవిచారం లేకుండా వున్నది.

ఇట్లాకొన్ని నెలలు గడిచింది. విశాల మెడికల్ కాలే జీలో చదువుతున్నా ప్రాక్టికల్ క్లాసులకు జనరలాస్పత్రికి వెళ్ళేది. ఒకనాడు జనరలాస్పత్రికి వెళ్ళినప్పుడు, ఒక బ్రాహ్మణ వితంతువు వారం దినాలకిందట ప్రసవం కావడానికి వచ్చినట్లు, ఆమె ఆదినం చనిపోయినట్టు, ఆమెకు షుమారు 8 యేండ్ల కూతురున్నట్టు, 'ఆపిల్ల'ని యెవ్వరు అడగడానికి రానట్టు, ఆపిల్ల చాలా యేడుస్తునట్టు విశాలకు తెలిసింది. ఎంతైనా ఆడప్రాణంకాబట్టి విశాలకు జాలిపుట్టి సూపరింటెండెంటువద్దకు వెళ్ళి ఆపిల్లను తన కియ్యమని అడిగింది. ఆయన సరేఅన్నాడు. విశాల ఆదరణచూచి ఆ పిల్ల విశాలను కౌగలించుకొని వద

లనే లేదు. విశాలకుకూడా ఆపిల్ల వాలకం, బంగారుచాయ ముద్దులమూటగట్టే ముక్కు, విశాలమైన కండ్లు, గుండ్రని మొగము మలిచినట్టున్న సర్వావయవాలు చూచినప్పుడు ఒక విధమైన అనిర్వచనీయమైన ప్రేమ ఉదయించింది. పై పెచ్చు ఆపిల్లస్థితి ఆమెప్రేమకు దోహద మైంది.

15 డిసెంబరు 1932 తేదీ సాయంకాలము ఆపిల్లను తీసుకువస్తూ దోవలోషాపులో రెండు సిల్కురకాలలో రెండు పరికిణీలకు, రెండు చొక్కాలకు గుడ్డకొని ఇంటికి వచ్చింది. సుందరమ్మ "ఈ పిల్ల ఎవరు" అని అడిగింది మొహం చిట్లిస్తూ, అది సాయంకాలమవుటచేత, గుళ్ళోకి వెళ్ళే వేళవుట చేత. "ఒకబీద బ్రాహ్మణపిల్లలే అమ్మా!" అని విశాల అన్నప్పుడు సుందరమ్మ యిక లోతుకుదిగక తన దోవను తాను పోయింది. విశాల వెంటనే తనచేతి మిషన్‌మీద ఒకపరికిణీ, ఒక చొక్కా కుట్టి ఆపిల్లకి నీళ్ళుపోసి వాటిని తొడిగింది. కాస్తసేపటికల్లా రామారావు వచ్చాడు. గదిలోకి వెళ్ళి చొక్కాలు విప్పుతూవుండగానే విశాల వెళ్ళి "ఇవ్వాళ నేనొక పనిచేశాను. మీరు క్షమించాలె నన్ను!" అన్నది.

"నీవెన్నటికీ తప్పుపనిచెయ్యవని నాకు నమ్మకమే కాబట్టి అడక్కముందే క్షమించాను. చెప్పుఏమిటో?" జరిగిన సంగతి చెప్పి దొడ్లోఉన్నపిల్లను తెచ్చి చూపించింది. రామారావుకు కూడా పిల్లమీద ప్రేమ అంకురించింది. ఆయన కూడా ఎత్తుకున్నాడు. కాసేపటికి విఠల్ వచ్చాడు. బళ్ళోనుంచి.

"అక్కా! ఈ అమ్మాయి ఎవరే?" అన్నాడు.

"నీతో ఆడుకోటానికి కెవ్వరూ లేరని పిలిపించాను తమ్ముడూ." వాడికి పట్టరాని సంతోషం కలిగింది. అప్పటి నించి వాళ్ళిద్దరికి జీవికాజీప. కొంతసేపటికి సుందరమ్మ వచ్చింది. అంతా విన్నది. అయిష్టంగా వున్నా బ్రాహ్మణపిల్లే కదాఅని మనస్సు కుదుర్చుకున్నది. సనాతనాచారానికి సూత్రం లేదు. కదూ? ఈపిల్ల వచ్చినప్పటినుంచి ఇంటికి వకవిధమైన క్రొత్త కళ వచ్చింది. విశాలా రామారావులకు మధ్య ఈపిల్ల ప్రేమ స్థానం అయింది. ఒకరిపై నొకరికిగల ప్రేమ పవిత్రతరం కావ టంమొదలుపెట్టింది. యిద్దరికికూడా యీపిల్లంటే పంచ ప్రాణాలు. దానికి "ఇందుముఖి" అని పేరెట్టుకొన్నారు. "ఇందూ" అని పిలిచినప్పుడు ఆపిల్ల పలుకుతూంటే వచ్చే మధురస్వనము ఇద్దరి మనస్సులను ఊపేసేది. విఠల్ పక్కన వుంటేనేగాని ఇందు అన్నం తినేదికాదు. ముసలమ్మకు ఇది కూడా భగవద్విలాసమేనని క్రమక్రమంగా ఔదాసీన్యం పోయింది. విశాలా ఇందులొక గదిలోను రామారావు విఠల్ ఒకగదిలోను పరుండేవాళ్ళు. విశాలా రామారావులు చేసు కున్న బాసకు బద్ధులై, ఇందు ఇద్దరికిని కట్టేసే శృంఖలకాగా విద్యాభ్యాసం చేస్తున్నారు. ఇద్దరు పిల్లలుండటంచేత వాళ్ళకు నూట్లనీ, గౌనులనీ, ఆటవస్తువులనీ, పండగ బహుమానాలనీ, ఖర్చుకొంచెము హెచ్చింది. సంగతులు కనిపెట్టి రామారావు అత్తవారు దరువనుకోకుండాచూస్తూండేవాడు. విశాల తన భర్తకు ఖర్చుతగులుతున్నట్టు తెలిసికూడా, తాను కాదంటే ఆయనకేమి కోపంవస్తుందో అని వూరుకునేది. సామాన్యంగా మెడికల్ కాలేజీలోని ఆడవిద్యార్థులు శీలం చెడకుండా బయ టకు రావటం అరుదు. విశాల అట్లాగాక నిర్దుష్టంగా బయటికి

వచ్చింది. ఇద్దరికి చదువు అయింది. విశాల ఫస్టున ప్యాసయింది. ఒక మెడల్ కూడ వచ్చింది. రామారావుకూడా యెక్ఫ్రో లైనాడు. విఠ్ఠల్ స్కూల్ ఫైనలు అయినాడు. అనుకున్న దంతా అనుకున్నట్టయింది. విశాలఅద్దెబాపతు కూడిన 2000 పెట్టి ఆసుపత్రి సామానులు కొనటం మొదలు పెట్టింది. రామారావు గుంటూరు ఇంటికి కొన్ని మార్పులు చేయించడానికి వెళ్ళాడు.

ఇల్లు తయారైంది. ఉత్తరం రాశాడు. సంసారం కదల్చుకుని 16-7-33 తేదీన గుంటూరులో యింట్లో ప్రవేశించారు. రెండు గేట్లలో ఒకదాని మీద 'K. Visalakshamma, M.B., B.S., Physician and surgeon' అనిన్నీ, రెండవదానిమీద "K. Ramarao, B.A., M.L., Advocate" అనిన్నీ బల్లలు కట్టారు. ఏనాడు ఇద్దరు ప్రాక్టీసు మొదలుపెట్టారో రెండుగేట్లవద్ద బండ్లు, మోటారులు అవిచ్ఛిన్నంగా ఎప్పుడూ ఆగుతు వుండేవి. ఒక్క ఏడాదిలో విశాల బ్యాంకులెక్క 10,000 దాకా పెరిగింది. రామారావుగూడా జూనియరులో లీడరు అనిపించుకుంటున్నాడు. విఠ్ఠల్‌గూడా యింటర్‌మిడియట్ ప్యాసయి B. A.లో చేరాడు. ఇందు 15 ఏండ్ల చిన్నదై మిసమిసలాడుతున్న యవ్వనంలో వున్నది. ఇందు విఠ్ఠలుల పరస్పర ప్రేమానుబంధము పెరుగుతూ పెనవేసుకొని పోతున్నది. విశాల రామారావులకు తీరుబడిలేదు. ఇద్దరికి పని ఎక్కువైంది. స్వవిషయమే మరిచారు. ఏకాన్త విరామమో వుంటే యిందుతో గడిపేవారు. 28-10-35 వరకు యిట్లా గడచిపోయింది. ఒక్క సుందరమ్మ

మాత్రం ఎప్పుడన్నా ఓప్పుడు వీళ్ళిక సంసారం చేయడం ఎపుడా అనుకుంటూ పెదిమలు చప్పరిస్తూ వుండేది. ఇందూ విఠల్‌లు మాత్రం "ఎప్పుడా" అనుకున్నట్లు కనబడేవాళ్ళు. 28-10-35 వ తేదీన రామారావు కోర్టునుంచి వచ్చి పడక వేశాడు. విశాల యింటికి వచ్చేటప్పటికి యిందు వాకిట్లోనే "బాబాయికి జ్వరం వచ్చింది" అని చెప్పింది. వెంటనే విశాల కలవరపడుతున్న మనస్సుతో రామారావు గదిలోకి పోయింది. అప్పటికే జ్వరం హెచ్చుగావున్నది. రామారావు కళ్ళు మూసుకొని నిద్ర పోయినాడు. విశాల వళ్ళు పట్టుకొని చూచింది. పేలిపోతున్నది. విశాల థర్మామీటరు చూస్తుండగా రామారావుకు మెళుకువవచ్చింది. "వచ్చావు విశాలా! యిక ఎట్లాగయినా పరవాలేదు. అని అన్నాడు. "ఇది ఏమిటి యిట్లా అంటున్నారు?" అనుకుంటూ విశాల టెంపరేచరు చూసింది. 104.8° వున్నది. ఆమెకు కాళ్ళాడలేదు. రామారావు 'దాహం కావాలి' అన్నాడు. యిచ్చింది. వెంటనే కారువేసుకు వెళ్ళి పావుగంటలో జిల్లాసర్జన్ని తీసుకొని వచ్చింది. ఇద్దరు పరీక్ష జేశారు. ఒక యింజక్షను యిచ్చారు. రామారావుకు కొంచెం నిద్ర పట్టినట్టు అయింది. డాక్టరు వెళ్ళాడు. విశాల విస్తరి యెంగిలి చేసి మళ్ళీవచ్చి మంచంప్రక్కనే కూర్చుంది. ఇందూ విఠల్‌లు చాలాసేపు దాకా మేలుకొని చెరోకచోటపడి నిద్రబోయినారు. ముసలమ్మ దేవుణ్ణి ప్రార్థిస్తు సావిట్లో కూర్చున్నది. అప్పుడప్పుడు ఆమెకు బ్యాంకులో విశాల సంతానానికిచ్చిన రూపాయలు మాత్రం జ్ఞాపకం వస్తున్నాయి. రాత్రి గడిచింది. మూడు దినాలైనా జ్వరం నార్మలుకు రాలేదు. నాల్గోరోజున మళ్ళీ

పరీక్షచేసి "న్యూమోనియా" అని నిర్ధారణ చేశారు. విశా లకు గుండెలలో రాయిపడ్డది. అనేక కేసులు ఇటువంటివి చేసిందికాని స్వవిషయంలో మనస్థైర్యం వుండటం అరుదు. దైవానుగ్రహం బాగావుంటేతప్ప తనగతి యేముంది! పరిపరి విధాలా బుద్ధి చలించింది. 10 వ రోజున జీవిస్తాడో లేదో అనే అధైర్యం తోచింది. ఆరోజు అమావాస్య. నాటువైద్యు లొచ్చి రెండుదినాలు గడుస్తే పర్వాలేదన్నారు. ఆరాత్రి విశాల తెల్లవార్లూ మంచం దగ్గరనే కూర్చుని రోగికి పరిచర్య చేస్తున్నది. రామారావు ఏమేమిటో తనలో తాను గొణుగు కుంటున్నాడు. 4 గంటలైంది. విశాలకు కొంచెం కునుకు పట్టింది. నిద్రలో తనతండ్రి కనబడి తనపైన గుడ్లురిమి "ఎంత బుద్ధిలేకుండా ప్రవర్తించావు విశాలా!!" అంటూవున్నట్లు కలగని వులికిపడి లేచింది. దేవుడు జ్ఞాపకం వచ్చాడు. తాను ఆర్థిక స్వాతంత్ర్యమని రెండు కుటుంబాలకు చేసిన అపకృతి మనస్సుకు తట్టింది. అందులో ఋషివంటి రామారావుకు జరిగిన అపకారం గోచరించింది. దుఃఖ మాపుకున్నా ఆగడం లేదు. కారిన నీళ్ళకు అంతులేదు. మధ్యమధ్య రామారావు లేచినప్పుడల్లా కండ్లు తుడుచుకుంటూ కావలసిన పరిచర్య చేస్తూ వచ్చింది. తనను దూషించుకుంది. వైధవ్యం తల్చు కుంటే గుండె బ్రద్దలవుతున్నది. ఆడదానికి ఎన్నివుంటేయేమి? భర్తలేకపోతే భగవంతుడి వుద్దేశ్యానికి వ్యతిరేకంగా నడిచి నట్టేనని నిశ్చయించుకుంది. తనకున్న ఆస్తి ఎందుకు? చదు వెందుకు? తన ఆర్థిక స్వాతంత్ర్యేచ్ఛ తనను ముంచిందని అను కుంది. రామారావులేని జీవితము తెరచాప తెగిన పడవ! జీవిత

ములో ఇక ఆ వర్ష మేముంది? జన్మ వ్యర్థము! వ్యర్థము! వ్యర్థము!

తెల్లవారింది. రామారావుకు కొంచెము నిద్రపట్టినట్లున్నది. అందరు కాలకృత్యాలు తీర్చుకున్నారు. విశాల మళ్ళీ మంచంపక్కకు చేరింది. సుందరమ్మ వేణ్ణీళ్లు కాయటం మొదలయిన పనుల్లోఉంది. ఇందూ విఠ్ఠలులు బిక్క మొగాలతో గుసగుస లాడుకుంటూ వున్నారు. జిల్లా సర్జను వచ్చి ప్రమాదావస్థ తప్పలేదని చెప్పాడు. విశాలకు అంత తెలివి ఏమైందో! ఒక విధమైన మాంద్యము పూనింది! నాటువైద్యుడొచ్చి నాడి చూశాడు. ఇంకా ధాతువు యధాస్థితికి రాలేదన్నాడు. సుందరమ్మ వచ్చి తొంగిచూచి "అమ్మాయీ ఎట్లా వున్నది" అని మెల్లిగా అడిగి నప్పుడు విశాలకు ఆమె మొగం చూడటానికి సిగ్గెయ్యటమే కాక, ఆమెతో ఏం సమాధానమూ చెప్పలేక కన్నీళ్లుకారుస్తూ మొగం రెండు అరిచేతులతో కప్పుకుంది. సుందరమ్మ మొగం చూస్తే కూతురితో "ఎందుకు దుఃఖిస్తావు స్వయంకృతాపరాధము" న్నట్టుంది. విశాలయెడల సానుభూతి చూపడానికి లోకానికేం బట్టింది? పైగా లోకం యిష్టమొచ్చినట్టు అనుకుంటుంది. తాను దానిని ఆపగలదా? తాను లోకంలోవున్న ఆచార వ్యవహారాలకు లెక్కచెయ్యనప్పుడు తనకు సానుభూతి చూపలేదని అనుకోవడం తప్పు. తనకు ఆర్థికస్వాతంత్ర్యమనే అభిప్రాయంచేత వక్కరోగికైనా ఉచితంగా చికిత్స చేసిందా? తెలివిగల దనిపించుకున్నదే కాని దానదయాపరురాలనిపించుకో లేదే? బ్యాంకిపుస్తకము నిండింది. కాని ద్రవ్యము ఆమెకిప్పుడు ఎంత మాత్రము జ్ఞాపకానికి రావటంలేదు. ఎంత ద్రవ్యమైనా రామారావు నష్టాన్ని భర్తీ

చేయగలదా? సంఘాన్ని వుల్లంఘించటానికి ఇద్దరే సమర్థులు. మొదటివాడు స్థితప్రజ్ఞుడు! రెండోవాడు పిచ్చివాడు! విశాల ఈ రెండు రకాలలోదీకాదు. ఇట్టి స్థితిలో సంఘము ఆమెను "విధవ" అన్నప్పుడు సంఘాన్ని లెక్క చెయ్యకుండా ఉండ గలదా? అట్టి మనస్థైర్యం లేదు. పోనీ, మళ్ళీ ఎవరినైనా ప్రేమిద్దామా అంటే రామారావుకు మనస్సు సంపూర్ణంగా అర్పించింది. మరి ఒక వ్యక్తికి అక్కడ చోటులేదు. కాబట్టి ఆవిధానం అసంభవం; ఇక ఆమె గతేమిటి? సంగతులన్ని తల్చుకున్నకొద్దీ ఆమె గుండెలు పగిలి పోతున్నవి. రామా రావు స్థితిచూస్తే నిమిషనిమిషానికి అధోగతిగానే ఉంది గాని యెట్టి ధైర్యాన్ని యివ్వటం లేదు.

మహా సముద్రంలో తుపాను కొట్టుకునే పడవల్లే ఆమె మనస్సు కొట్టుకుంటుంది. మాటి మాటికి విఠలు, ఇందు, సుంద రమ్మకూడా గదివాకిటదగ్గరకి వస్తూఉండడం, విశాల మొగం చూచి వెళ్ళిపోతూ వుండడం! వాళ్ళను చూచేటప్పటికి విశాలకూ దుఃఖము ఎక్కువకావటం!

ఇట్లావుండగా రామారావు అకస్మాత్తుగా కళ్లు మూసు కునే "మామగారూ! నాతప్పు క్షమించండి. విశాలపైనకోప పడకండి, పూర్తిగా ఆమెతప్పుకాదు. చూడు విశాలా! తన వుద్దేశం నెరవేర్చలేదని మనను కోప్పడుతున్నాడు" అంటూ కేకేసాడు. విశాల వులికిపడి లేచింది. రామారావుకు దగ్గరికి వంగి మొగం తుడిచి "పరుండండి" అని కొంచెం ఆహారం ఇద్దామని చంచాతో పాలు తీసుకొని నోట్లో పోసేటప్పటికి తెరచిఉన్న నోట్లోనుంచి చిలవల గుండా కారిపోయాయి.

ఇదేమిటా అని ముక్కుదగ్గర వేలు పెట్టింది. శ్వాసలేదు. గుండెలదగ్గిర చేయిపెట్టింది. వెంటనే గదివదలి తనగదిలోకి పోయి తలుపు బిగించుకుంది.

రెండు నెలలకు విచారించగా యిందూ విఠలులకు వివాహమైనట్టూ, సుందరమ్మ కాశీవెళ్ళినట్టూ, విశాల తనయింటిని స్త్రీ శిశువైద్యశాలగా మార్చి తనద్రవ్యమంతా దానికిచ్చివేసి, తానందు జీవితాంతం వరకు సేవచేయ నిశ్చయించినట్టూ తెలిసింది. స్త్రీలు ప్రాచీన సంప్రదాయాలను విడవకుండా విద్యను అభ్యసించాలనీ, ఆర్థికస్వాతంత్ర్యం మొదలైన ఆధునికాభిప్రాయాలన్నీ పొరబాటనీ, సంతాననిరోధము మొదలైన సూత్రాలు అస్వాభావికాలేగాక మానవపతనానికి కారణాలనీ, అప్పుడప్పుడు ఉపన్యాసా లిస్తున్నట్టుకూడా వినవచ్చింది.

[ ఈ కథ 'భారతి'లో పూర్వం ప్రచురింపబడింది. ]

# నా రత్నం

నేను బి. యే. చదువుతున్నప్పుడు మాస్కూల్లోనే యింటరు చదువుతూ వుండేది రత్నం. కారణాంతరాన మా కిద్దరికి వకమారు సమావేశమైనది. ఆ ఘడియ యెటువంటిదో కాని పరిచయం పెరిగింది. తుదకు ప్రేమగా మారింది. ఇద్దరం కలసి మా భవిష్యత్తుకూడా ముచ్చటించుకునే వాళ్ళం. అప్పుడు మేమిద్దరం మాట్లాడుతుంటే మాకు నోరూరుతూ వుండేది. నేను సరిగా బి. యే. ప్యాసయ్యే టప్పటికి రత్నం కూడా యింటర్ ప్యాసయింది. ఆమెకు మొదట్నించి సంఘసేవ చెయ్యాలని వుండేది. నాకు వకీలై ప్రాక్టీసుచేసి కీర్తిధనాలను సంపాయించి ఆఖరు దశలో యథాశక్తి దేశసేవ చెయ్యాలని వుండేది. ఇద్దరికి ఉన్నతాశయా లేవుండేవి. అనుభవం లేదు కదూ ! కష్టసుఖాలు తెలిసే యీడుకాదు.

మానాన్న నాకు మంచి సంబంధంకోసం వెతకటం మొదలెట్టాడు. ఎక్కువ ధనవంతులం కాకపోవటంచేత, వున్న ఆస్తిలో ముప్పాతిక నా చదువుకోసం పోవటంచేత ఊతంగా సంపాదించాలని మా నాన్నకు పుట్టింది. ఒక సబుజెడ్జిగారి కూతుర్ని నిర్ధారణ చేశారు మా తల్లిదండ్రులు. బి. యెల్. చదువుతున్న నాకు పట్నానికి వుత్తరం రాశారు. నేను వూరికిపోయినా. ఇట్లా సంబంధం వచ్చిందని చెప్పారు. కాని నా మనస్సంతా రత్నం మీదుండటంచేత, నేను వాళ్ళ సలహాకు యెంతమాత్రం సమ్మతించలేదు. "అయితే నీ అభిప్రాయ మేమిట"ని నన్నడిగారు. మనస్సంతా రత్నంతోనిండి

వుండటంచేత నేను నిజమే చెప్పాలనుకుని "నా ఉద్దేశం రత్నాన్నితప్ప నే నెవ్వరిని చేసుకోన"ని ఘట్టిగా చెప్పేశాను. మానాన్న అన్నాడు.

"అబ్బాయీ! నీకు కష్టసుఖాలు తెలియవు. సంసారం అంతా నీకోసం గుల్లయిపోయింది. నీవు సంపాయించి మమ్ము ధ్ధరిస్తావని కొండంత ఆశతో వున్నాము. కుటుంబమూ, మర్యాదా, చూడాలెగాని చూపులతో మోసపోకూడదు. మా మాటలు వినకపోతివా నీదోవ నీది, మాదోవ మాది."

ఈమాటలు విన్నప్పుడు మనస్సుకు కష్టంగానే వున్నది. కాని జీవితమంతా కష్టమో సుఖమో అనుభవించాలసిందే కాబట్టి, ఆదినిష్ఠూరం అంత్యనిష్ఠూరంకంటె మంచిదని, నేను యెంతమాత్రం చోటియ్యలేదు. తుదకు నేను మళ్ళీ కాలేజికి వెళ్ళవలసి వుండటంచేత ఘట్టిగా చెప్పిపోయినాను. వెళ్ళి వెంటనే రత్నానికి జరిగిన విషయం తెల్పుతూ వుత్తరం రాశాను. ఆమె మళ్ళీ తన మనస్సు నాయందే లగ్నమైం దనీ, నేను తన్ను పెండ్లాడనియెడల తాను జీవితమంతా కన్య గానే వుండనిశ్చయించానని రాసింది. మానాన్నదగ్గిరనుంచి, తన మాటవింటే సరే, లేకపోతే తానిక నాకు డబ్బుపంపనని కఠినంగా వుత్తరం వచ్చింది. మనస్సు తటపటాయించింది. "చిన్నతనం వదిలింది. బి. యే. ప్యాసయినా, స్వతంత్రంగా సంపాదించుకునేశక్తి వచ్చింది. తండ్రికుమాళ్ళు విడిపోవడం, వివాహం చేసుకుని, వేరే సంసారం స్థాపించడమే ఉత్తమ" మని నిశ్చయించి నారత్నాన్నే పరిగ్రహించి తల్లిదండ్రులను వదలడానికి నిర్ధారణ చేశా. రత్నానికి మళ్ళీ సంగతులు

తెల్పుతూ నౌకరీకోసం ప్రయత్నించా. పని దొరికింది. నెలకు 50 రూపాయలు జీతం. రత్నం తల్లిదండ్రులు ఆధునిక నాగరకభావాలు కలవాళ్ళవటంచేత వప్పుకున్నారు. పెండ్లి అయింది. ఒకరినొకరు ప్రేమించియుండటంచేత, మా మనస్సులు ఒకరొకరితో నిండివుండటంచేత, ప్రపంచంలో మాకంటె అదృష్టవంతులు లేరని కాలం గడపటం మొదలెట్టాము. సంసారం ఆసాదించాము.

2, 3, సంవత్సరాల్లో నాజీతం 100 రూపాయలైంది. రత్నమూ నేనూ బీచికిపోతూ సుఖంగా కాపురంచేస్తున్నాము. రత్నం చదువుకున్నది కాబట్టి ట్రిప్లికేను లేడీసుక్లబ్బులో మెంబరుగాచేరింది. ఆడవాళ్ళకుకూడా స్వాతంత్ర్య మియ్యాలనే భావంలోనివాణ్ణికాబట్టి సంతోషంతో అంగీకరించాను. నాకు ఉదయం 8గంటలనుంచి సాయంకాలం 6 గంటలవరకు ఆఫీసుపని. ట్రిప్లికేనునుంచి బీచిమీదవున్న ఆఫీసుకువెళ్ళటానికి, మారత్నం టెన్నిసుచందాలు, వగైరాఖర్చులు కొంచెము బరువుగాతోచి నేను సాయంకాలం యింటికినడిచి వచ్చేవాణ్ణి. ఇంటికొచ్చేటప్పటికి మారత్నం క్లబ్బునుంచి ఇంకావచ్చేది కాదు. ఇల్లు కనిపెట్టుకుండటానికి వక ఆడమనిషిని పెట్టాలసొచ్చింది. దానితో కొంచెం బరువెక్కువైంది. కాని మారత్నాన్ని కొంచెం జాగ్రత్తగా ఖర్చుచెయ్యమని చెప్పటానికి సాహసంలేకపోయింది. అట్లాగే మెల్లిగా నెట్టుతున్నా. మా నాన్నకు పైకంకోసం యే మొఖంపెట్టుకుని రాయను?

* * * *

"ఏమి? నా టెన్నిషుబూటు చినిగిపోయింది."

మరునాడు బజారుకుపోయి యింకొక జతకొనుక్కున్నది.

*    *    *    *

"ఏమండీ! టెన్నిషుబూటు గట్ తెగిపోయిందని మీకు తెలిసికూడా మీరూరుకోవడం బాగుందీ"

మళ్ళీ 5 రూపాయలుబెట్టి రీ గట్ చేయించిపెట్టా.

*    *    *    *

"కండ్లు చదువుతూంటే మంటలండీ!"

మరునాడు డాక్టరు ఇ. వి. శ్రీనివాసన్ వద్దకువెళ్ళి 10 రూపాయిలిచ్చి పరీక్షచేయిస్తే కండ్లజోడు కొనుక్కోవాలన్నాడు. అట్లాగేనని 'లారెన్సు అండు మేయో'లోకిపోయి 27 రూపాయలుపెట్టి కొనుక్కుంది.

ఒక సంవత్సరం అఖిలభారత స్త్రీ మహాసభ పట్నంలో జరిగింది. దానిలో మారత్న ఆహ్వానసంఘ కార్యదర్శిని అయింది. చాలా అదృష్టవంతుణ్ణనుకున్నా. అటువంటి ఆడదానికి భర్తనుకదా అని గర్వపడ్డా. కాన్ఫరెన్సుకు పురుషులకుకూడ ప్రత్యేకపు యేర్పాట్లు చేశారు. అక్కడ నేనుకూడా కూర్చున్నా. మాచుట్టు ప్రక్కలనుంచి "చూశావూ? ఆకండ్లజోడు పెట్టుకుని టిక్కు టిక్కుమని తిరుగుతూందే! ఆమె మొగడే యీన" అని నన్ను చూపిస్తూ చెపుతున్న మాటలు వినపడ్డాయి. మనస్సు చివుక్కుమన్నది. ఏమిచేయను మింగుకున్నా.

మరునాడు బహిరంగ సభలో మారత్నంకూడా వక తీర్మానం ఉపపాదించింది. అది స్త్రీలఆర్థిక స్వాతంత్ర్యాన్ని

గూర్చి. ఆమె మాట్లాడుతుంటే నాప్రక్క నొకడున్నాడు. "పెండ్లాము లెక్చరిస్తూంటే వింటూంటే యెట్లావుంటుందో నా కనుభవము లేదురా?" ఆమాటలు నన్నుగురించేనని తెలిసినా నేను చేసేదేముంది?

కాన్ఫరెన్సు రెండురోజులూ నాకు యింట్లో స్వహస్తమే. ఆమెనంటే యేంలాభం. పాపము తీరుబడిలేదు. అంతాఅయిపోయింతర్వాత అధ్యక్షురాలు వగైరా 20 మందికి నియోకోమల విలాసములో టీపార్టీ చేసింది మారత్నం. బిల్లు 75 రూపాయలైంది. చచ్చినట్టిచ్చుకున్నా.

* * * *

చీరెలంటే, పౌడర్లంటే, బూట్సంటే, టెన్నిసుబ్యాటంటే, బ్రూచిలంటే, ముత్యాలహారమంటే, చందాలంటే, క్రమక్రమంగా ద్రవ్యం ఖర్చుకాక తప్పిందికాదు. మాఆఫీసుకోఆపరేటీవు సొసైటీలో అప్పైంది. నా జీతంలో నుంచి 5 దోవంతు బిగపట్టు కుంటున్నారు. అంచేత నాజీతం 80 రూపాయలే అయింది. సంసారానికి హాని హానిగా చాలేది.

* * * *

ఇట్లావుండగా యీామె ఉపపాదించిన తీర్మానాన్ని గూర్చి దేశంలో ప్రచారం చెయ్యడానికి కాన్ఫరెన్సువారు యీామెను సంచారం చెయ్యమన్నారు. ఆమెకు మొదట్నించి తనకున్న సంఘసేవోద్దేశం ఫలించిందికదా అని మిక్కిలి ఆనందం కలిగింది. ఖర్చులకుగాను 200 రూపాయలు సభవారు మంజూరు చేశారు. కాని మారత్నం మదింపు ప్రకారం అది చాలేట్టులేదు. ఇంకా 200 లైనా కావాలెనన్నది. ఏంచె

చ్చాను. "నావద్ద లేవని నీకు తెలియదా రత్నం" అన్నాను. కాని "ఏమండీ నాకు పదవిరావటం మీకిష్టలేదాయేమి?" అని వక్కమారు కోరచూపు చూచేటప్పటికి కనికరం, భయం కూడా వేశింది. అప్పుడొక మార్వాడీ దగ్గరికి వెళ్లి ప్రోనోటు రాసి 200 తెచ్చియిచ్చా. ఈసర్క్యూటు షుమారు నెలదినాలు. "నెలదినా లామెయింట్లోవుంటే ఆమెకు ప్రత్యేకం 50 రూపాయలు ఖర్చేకదా! కాకపోతే యిక 150 యే కదా యెక్కువ" అని మనస్సు కుదుర్చుకున్నా. ఆమెను రైలు యెక్కించి వచ్చా. నెత్తిమీదినించి బరువు దించినట్టుంది. బాగా నిద్ర పట్టింది. మర్నాటినుంచి అన్ని పేపర్లలో మారత్నం లెక్చర్లు పడటం మొదలెట్టాయి. "Grand address by Mrs. Ratnabai Ramarao" అని "A fervent appeal" అని "A clear case for womens' Rights" అని "Womens' Rights vindicated A stirring speech" అని యీవిధంగా మారత్నం కీర్తి వ్యాపిస్తూంటే నాకు వకవేపున గర్వము, మరోవేపున దుఃఖమూ కలిగింది. "ఈ టూరునుంచి వచ్చింతర్వాత నా అవస్థ దుర్భర మవుతుందనే" భయము కొంచెం మొలకెత్తింది. క్రమక్రమంగా వృద్ధి బొందుతున్నది.

అకస్మాత్తుగా ఒకదినం "Purse stolen wire fifty. Ratna" అని టెలిగ్రాంవచ్చింది. అదృష్టవశాత్తు ఆ దినం జీతాల దినమైంది. అంచేత వెంటనే పంపా. కాని "ఈమె ఆర్థికస్వాతంత్ర్యమంటుందే? నన్నెందుకడగాలె" అని మాత్రం మనస్సుకు తోచింది. ఎంత భారమైనా నారత్నమేకదా అని సరిపెట్టుకున్నా. నెల దగ్గిరికొచ్చింది. ఇక రెండు మూడు దినా

లకు వస్తుందనగా గుండెలు కొట్టుకోటం మొదలెట్టాయి. రెండు దినాలకల్లా "Arriving mail meet Station. Ratna" అని టెలిగ్రాం వచ్చింది. గుండెలు కొట్టుకుంటూ స్టేషను కెళ్ళా. రైలు దగ్గరికివచ్చినకొద్దీ దడదడ యెక్కువైంది. ఒక నిమిషం కింద పడతానేమో అనుకున్నా. రైలు వచ్చింది. ఆగింది. సెకండుక్లాసులోనుంచి మా రత్నం దిగింది. సామాను జూచు కుంది. ఆమెతో కూడా సూటువేసుకొని కండ్లజోడు బెట్టుకొన్న వక యువకుడు కూడాదిగాడు. ఆయనను నాదగ్గిరకు తీసుకొని వచ్చి "ఈన ప్రొఫెసరు సంజీవరావు పి. హెచ్. డి. (విస్కాన్ సిన్)" అని నాకు ఇంట్రొడ్యూసు చేసింది. మేమిద్దరము షేక్ హాండ్సు చేసుకున్న తర్వాత నన్ను పక్కకు పిల్చి "ఆయన కూడా వున్నాడు. జట్కా బాగుండదు. మోటారు పిలవండి" అన్నది. సరేనని బయటికి బోయి మోటారు పిల్చుకొచ్చి సామాను అందులో పెట్టించి అందరం యింటికి పోయినాము. అప్పుడిక వంటచేయడానికి వీలులేక అందరికి హోటలునుంచి అన్నము తెప్పించాను. మరునాడు సాయంకాలము ఈమె చేసిన ప్రచారానికి సంతసించి యీమె కభినందనపత్రము సమ ర్పించటానికి స్త్రీసభవారు మీటింగు పెట్టారు. ఆ మీటింగులో మారత్నం యిచ్చిన యుపన్యాసంవల్ల ఆమె ధోరణి సరిగా లేనట్లు నాకర్థమైంది. "స్త్రీలను తొక్కేస్తున్నారట పురు షులు! స్త్రీలందరు చేరి పురుషులకు బుద్ధిచెప్పాలెనట! స్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్యము కావలెనట! విడాకులచట్ట మవసర మట! సంతాననిరోధము మన దేశమునకు ప్రస్తుత మవసగ మట! ఇక స్త్రీలు పురుషుల నిగళాల్లో వుండజాలరట! వివాహ ముభయుల సమ్మతియటగాని మతసంస్థ కాదట! భార్యా

భర్తృ సంబంధ మైచ్ఛికమట" ఈ యుపన్యాసము విన్నతో డనే ఆమెపాఠ మామె కొప్పజెప్పి విడాకులియ్యాలని కలిగింది గాని తొందర పడకూడదని ఊరుకున్నా. మాయిద్దరి హృదయాలు వెనకటల్లె లేవని స్పష్టపడింది. ఆమెతో వచ్చిన సంజీవరావు వై. యం. సి. ఏ లో ఒకగది తీసుకున్నానని మా యింటినుంచి వెళ్ళిపోయాడు.

*    *    *    *

"నాకు విశ్రాంతి లేకపోవడం మీరుచూస్తున్నారు కదా? మీక్కూడా తీరుబడి లేదాయె. మనమొక వంటకత్తెను కుదుర్చుకుంటే మంచి దని తోస్తుంది."

నేనేం మాట్లాడలేదు.

"మళ్ళీ నాకు సర్కీటు తగిలేటట్టున్నది. అంచేత నే లేనప్పుడు మీకూ వీలేకాదా"

"వీలు బాగానేవున్నది. కాని ఖైలంతక్కువగావుంది"

"ఇంకోవిషయంలో ఆదాచేదాం"

"చెప్పూ, దేనిలో చేదామో"

ఆలోచించినట్లు కనపడింది ముఖవైఖరి.

"నాకేం తోచలేదు" అన్నా.

"నాస్వవిషయంలో ఆదాచెయ్యడానికి మార్గంలేదని మీకు తెలుసు కాదూ. ముందు ఆలోచనేం?"

"కోఆపరేటివుబ్యాంకులో బాకీ యింకా తీరలేదు. తరువాత తెచ్చిన రెండువందలలో చిల్లిగవ్వ చెల్లించలేదు.

ఇప్పుడు మళ్ళీ అప్పిచ్చేవాళ్ళుకూడా కనపడలేదు. కష్టసుఖా లిట్లావున్నాయి.”

“అయితే నేను కష్టసుఖాలు తెలియనిదాననని మీ అభిప్రాయం”

నేనేం మాట్లాడలేదు. రత్నం మొఖంచూస్తే యేదోవక ఆలోచనలో వున్నట్టు తోచింది. రెండుదినాలు హోటలులో తెప్పించుకొని తిన్నాం.

* * *

మూడోనాడు సాయంకాలం హోటలునుంచి వచ్చిన అన్నం తిన్నాము. మా వైఖరి మునపట్లే లేదు. నామనస్సులో రత్నం తెల్లయేనుగుగా కనిపిస్తూంది. ఆమెకు నే నెట్లా వున్నానో ఊహించలేకుండావున్నా! ఇద్దరం చెరోమంచం మీద పరున్నాం.

“మన సంసారపు ఆర్థికస్థితి మీ మనస్సుకు శల్యంగా వున్నట్టు తోస్తున్నది.

నేను మౌనం వదలలేదు.

“మరిన్నీ నావల్ల యెక్కువఖర్చు అవుతున్నదనికూడా మీ మనస్సులోవున్నట్టు కనపడుతున్నది”

“నిన్ను నే నేమిన్ని అనడంలేదు. మన సంసారపు తాహతునుగూర్చిమాత్రం ఆలోచిస్తున్నా”

“అందుకోసమే నేను స్త్రీలకు ఆర్థికస్వాతంత్ర్యం కావాలనేది. మీమీద ఆధారపడబట్టేకదా మాకు పుంగరాల మొట్టు.”

"ఆలోచిస్తే స్త్రీ పురుషుల కిద్దరికి ఆర్థికస్వాతంత్ర్య ముంటేనే బాగుంటుందని తోస్తున్నది"

"అంటే మీసంపాదనను నే ఖర్చుపెట్టుతున్నాననేగా!"

"విపరీతార్థం తీసి అభిమానపడద్దు."

"మీరన్నమాటకు మరి వేరర్థం యేముంది?"

"ఇద్దరికి ప్రత్యేకంగా స్వంత ద్రవ్యముంటే వకరి కొకరికి సహాకారంగా వుంటుందనడంలో తప్పేముంది?"

"అంటే నీ స్వంతద్రవ్యం లేదని యెత్తిపొడవడమే కదూ"

"దాన్నే నేను విపరీతార్థ మన్నది"

"ఇట్టి విషయం నీకూడా తెలియటం మంచిదే"

ఆమె ముఖ మెఱ్ఱబారటంచేత మనస్సు ప్రతిబింబించింది. ఇది సమయంకాదని నేను పస్తాయించి ఊరుకున్నా. రాత్రి గడిచింది. ప్రతిరోజు ఉదయం 8 గంటలలోపున, సాయంత్రం 8 గంటల తర్వాతేకదూ మేము కలవటం.

* * * *

మరునాడు రాత్రి భోజనాలైనాయి. తర్వాత గబగబ తన చిన్న తోలుసంచితీసి, తెరచి యేవో కాగితాలుతీసి రివ్వున నావద్దకువచ్చి వాటిని నామీద విసిరేసింది. చూస్తే అవి 250 రూపాయలు.

"నా కేమర్థం కాలేదు. ఏమిటిది?"

"మీరు నాకొరకు చేసిన అప్పు తీర్చుకోండి"

"నీచర్య ఆశ్చర్యంగా వుండే. డబ్బు నేనడిగినానా"

"ప్రత్యక్షంగా అడగలేదు"

"నాకక్కరలేదు" అంటూ మళ్ళీ తీసుకెళ్ళి ఆమె దగ్గరపెట్టా. ఆమె వాటిని మళ్ళీ నాకై విసిరేస్తూ,

"మీ మొగవాళ్ళంతా యింతే. మొదట ప్రేమంటారు. ఆడది స్వజనాన్ని వదిలివచ్చిన తర్వాత కాలబెట్టి నేలరాస్తారు"

"నేనుకూడా దానికి సమాధానం చెప్పాలనీ నా వుద్దేశం. సంసారం వక బండివంటిది. భార్యాభర్తలిద్దరు రెండు చక్రాలు. కాబట్టి వకరి కొకరికి సహకారం ఇస్తూ, సమంగా నడవాలె. ఈమాట చెప్పినందుకు కోపమా? నీకీ విషయం తెలిసుండాలిశింది."

"మళ్ళీ అదేసంగతి సహకారం ద్రవ్యవిషయంలోనేగా ఇంకేముంది."

"నిజమాడితే నిష్ఠురం"

మొదటి మెట్టుప్రేమ. అనుభవం కలిగినకొద్దీ సమస్య ఆర్థికమై పోయింది. నాకు తోచింది "మొదట్నించీ సీతా సావిత్రులయొక్క వారిభర్తలయొక్క వైఖరీకూడా ఇట్టిదేనా" అని. కాని పుస్తకాలు చూస్తే అట్లా కనపడదు. ఏది ఎట్లాగైతేయేం, యిప్పటి తుపాను తప్పించుకోవాలెగా ! అందుచేత ముదరకుండా,

"నీవు ద్రవ్యం తెచ్చియియ్యాలని నాకెప్పుడు లేదు. సంసారంలోఉన్న నాసంగతికూడా ఆలోచించమని మనవి

చేశా. ఇంతలో కోపము రావాలా ! నాకష్టము నీతో గాక యింకెవ్వరితో చెప్పుకోను?'' క్షమాపణ వేడుకున్నా. యెడ మొఖాలతోనే రాత్రి గడచింది.

*    *    *    *

నాలుగుదినాలతర్వాత విచారిస్తే నాస్నేహితుడని ఎవరో ఒకఆయనవచ్చి వడ్డీతో చెల్లించి నేను రాశిచ్చిన ప్రోనోటు తీసుకెళ్ళినట్టు నాకు తెలిసింది. ఇట్లాగే ఉదాసీనంగా వుంటున్నాము. పోనీ ఆడది, నేనుప్రేమించినది కొన్ని సంవత్స రాలనుంచి కాపురం చేశాము. ఏదో కొంచెం భారమైనా సహించాలని అప్పుడప్పుడుతోచింది. కాని దానివల్ల వచ్చే పరిణామం తలుచుకుంటే గుండెలుపగిలిపోయినాయి. 3రోజులు గడిచాయి. ఇద్దరికీకూడా ప్రథమప్రేమ యేమైందో? నిజమైన ప్రేమకు "క్షణేక్షణే నవ్యత" ఉంటుందంటారు. మొగవాణ్ణి సరే. ఆడవాళ్ళహృదయాలు నవనీతమల్లె మెత్తనివనిన్నీ భావ పూర్ణములనిన్నీ. కవులు, మన స్తత్వవేత్తలు చెపుతారే? మారత్నం మనస్సు యింతకఠినం కావటానికి కారణమేమిటో? నేను దుర్మార్గుణ్ణని నిర్ధారణ చేసుకున్నా, రత్నం ప్రవర్తన బోధపడటంలేదు. ఒక వారందినాలయింది. ఈవారం దినాలకు గాను నాలుగు మాటలేమన్నా మాట్లాడా మేమో ! ఒకనాడు నాకు దుస్సహంగావుండి రత్నం మంచంమీదకెళ్ళి,

"రత్నం! నావల్ల తప్పుంటే క్షమించు" అన్నాను.

రత్నం మాట్లాడలేదు. 'ఏం రత్నం! మాటలాడవూ!' అన్నాను. ఆమెకండ్లనుంచి నీరుకారుతున్నట్లు కనపడి, 'ఎందుకు రత్నం! ఏడుస్తావు' అని దీనంగా అన్నాను. 'క్షమిం

నా రత్నం



ఒక్కమాటు రత్నాన్ని చేతుల్లో పట్టి............

చాలసింది మీరు. నేను కాదు.' అన్నది మాటరాక. నాకు యెక్కడలేని దుఃఖంవచ్చింది. నాకాఠిన్యంచేత నేకదా మా రత్నాన్ని యింతకష్టపెట్టానని పశ్చాత్తాపం కలిగింది. ఒక్కమారు రత్నాన్ని చేతుల్లోపట్టి చుబుకం పుణికా. రత్నం కరిగి పోయింది.

'కష్టసుఖాలు తెలియక, మీతాహతు గమనించక, పై పోకడలకుపోయి, మిమ్ములను ఋణాలుపాలుచేసి మీరు అప్పటికీ మెల్లిగాచెబితే కోపించి, తుదకు మీకు ద్రోహం చెయ్యటానికికూడా తలపెట్టిన దుర్మార్గురాలను. నేను పాపిని.'

ఈమాటలు వినేటప్పటికి నాకు యెక్కడలేని దుఃఖము వచ్చి, మారత్నముకు కల్గిన పశ్చాత్తాపంచేత సమస్తలోపాలు భస్మమైనట్టు తలచి ఆమెవల్ల ఎన్ని తప్పులున్నా క్షంతవ్యారాలని మనస్సులో నిశ్చయించుకొని,

"నీవు ఏమిచేయదలచింది నాకు అనవసరం. నాకు నీపై వున్న ప్రేమ నీవు చేయదలచినదానిపై ఆధారపడలేదు. నీవు ఎప్పుడును నా రత్నానివే! తప్పుచెయ్యటం మనిషికి సహజం. పశ్చాత్తాపంచేత అన్నితప్పులు పోతాయి. కాబట్టి నీ పశ్చాత్తాపంచేత నాకు నీపైవున్న ప్రేమ సానదీసినట్లయింది. ఎన్నటికి ఇక నిన్ను పల్లెత్తుమాట అననని ప్రమాణం చేస్తున్నాను' అని రత్నంచెయ్యితీసుకుని అరిచేతిలో చెయ్యివేయబోయేటప్పటికి చేయిలాక్కొని తన రెండుచేతులతో నా రెండుకాళ్ళు పట్టుకుని,

'మీరు నన్ను క్షమించానన్నదాకా వదలను' అని దీనంగా అన్నది. ఆమెను లేవనెత్తా. ఆనాటినుండి మేము

వెనుకటి ప్రేమాస్పదులమైన దంపతులమైనాము. తరువాత డాక్టరు సంజీవరావు ఊరువదలినాడని తెలిసింది. రత్నం స్త్రీ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయినిగా చేరింది. ఆమెకు 80 రూపాయల జీతంఅయింది. ఇద్దరము సుఖంగా కాలంగడిపాము. తరువాత 3 సంవత్సరములకు రత్నాన్ని అఖిలభారత స్త్రీ మహాసభకు అధ్యక్షురాలిగా పిలిస్తే నాకక్కరలేదని నిరాకరించింది. పట్నంలోనే స్త్రీ సభాశాఖకు కార్యదర్శినిగా పని చేసింది. తరువాత రెండుసంవత్సరాలకు మాకొక కొడుకు గలిగాడు. అప్పటినుండి మా సంసారాని కొక నూతనకళ వచ్చింది. రత్నమే సంసారం నిర్వహించటం మొదలెట్టింది. ఆర్థికంగా ఎట్టిపరస్పర విరుద్ధం రాలేదు. రత్నంలాంటి కొడుకుని కని నారత్నం నాకు రత్నమైంది.

కొన్నాళ్ళ తర్వాత 220 రూపాయలు ముట్టినట్టు వక రసీదు చిత్తుకాగితాల్లో కనబడ్డది. దానిమీద సంజీవరావు సంతకమున్నది!

[ఈకథ సికిందరాబాదునుంచివచ్చిన '1936' అనే పత్రికలో పూర్వం ప్రచురింపబడింది 1936 సంవత్సరంలో.]

# ఉ దా హ ర ణం

౧

రామారావు ఆనర్సుగ్రాడ్యుయేటు. దాదాపు పదేండ్లు అనేక వుద్యోగాలు తిని తుదకు 4 యేండ్లక్రిందట స్థాయైన ఉద్యోగంలోచేరాడు. ఇప్పు డిప్పుడే వెనుకటి చిక్కులు వదలిపోతున్నాయి. ఈయన భార్య సీతమ్మ గొప్పయింటి ఆడ బడుచు. వీరిద్దరు చాలా అన్యోన్యంగా వుంటారనీ ఆదర్శ దంపతులనీ వాళ్ళ నెరిగిన వాళ్ళంతా అనుకుంటూ వుంటారు. వీళ్ళకి సంతానం నష్టమై నష్టమై చివరికొక్క ఆడపిల్ల బ్రతికింది. శారదను చాలాకట్టుగా పెంచాలని తల్లిఉద్దేశ్యం; ఆమెకు సంగీత సాహిత్యాల్లో మంచిప్రవేశం కలగజేసి విద్యావతిని చెయ్యాలని తండ్రిఉద్దేశం; రెండూ మంచివే. పిల్ల మాత్రం చిన్నప్పటినుంచి కొంచెం బిరుసుపాకం అనిపిస్తుంది. రామా రావుకు నెలకు 250 రూపాయులజీతం. ఒక్కపిల్ల కాబట్టి యే లోపంలేకుండా సాధ్యమైనంతవరకు కలవాళ్ళబిడ్డల్లే పెంచు తున్నట్లు లోకం అనుకుంటారు. రకరకాల లంగాలు, రంగు రంగుల వోణీలు! బళ్ళోకి బండిమీద వెళ్ళటం! నెలకు పది రూపాయిలిచ్చి సంగీతం, మరోపదిరూపాయిలిచ్చి ప్రైవేటు! ఇట్లా లోకానికి చూట్టానికీ సంసారం ముచ్చటగా ఉంది. తల్లిదండ్రుల కింకేం కావాలి? మంచి సంబంధంచూసి ఒకయ్య చేతుల్లో పెడితే వాళ్ళజన్మతరిస్తుందని చూచినవాళ్ళంతా అనుకుంటూ ఉంటారు.

రుకశ

౨

క్క!

లోకంలో వాళ్లేమనుకున్నా భార్యాభర్తల అన్యోన్యం ళ్ళకేం తెలుస్తుంది? మనస్సులు కలిసిన అన్యోన్యాన్ని ప్పదనచ్చు; అట్లాకానిది మేడికాయవంటిది. భార్య మంచి ు భర్త, భర్త మంచివాడని భార్య చెప్పుకోడం చాల రుదు. భర్త యెంత విద్యావంతుడైనా గుణవంతుడైనా ార్యకు నచ్చడు; భర్తకు భార్యాకూడా అంతే! చూడు చ్చమ్మ మొగుడు ఎంత మంచివాడో! జీతంరాగానే ఆమెకు నీయిష్టంవచ్చినట్టు చేసుకో'' మని 10 రూపాయలిస్తాడట! సేమాటలు సామాన్యంగా వినబడుతూనే ఉంటాయి. వీళ్ళ షయంలో మాత్రం ఇట్లా చెప్పుకున్నట్టులేదు. ఎన్నడూ వాళ్ళు తగాదాపడ్డట్టు ఎవ్వరూ అనుకోలేదు. కాని వాళ్ళ యింట్లోసంగతి యెవరికి తెలుసు పాపం! సీతమ్మ ఎక్కువగా కనడంచేత శరీరం దుర్బలమైపోయింది. కనపడడానికి బూరుగ వృక్షమల్లె వుంటుంది. కాని డబ్బైత్తు సత్తువలేదు. ఇంట్లో ముగ్గురు-పిల్లలతో కూడా. పనిచేసేమనిషి ఉంది. మొగుడు కచేరికి, పిల్ల బళ్ళోకి వెళ్ళారా సాయంకాలందాకా యేం పనుంది? ప్రత్యేకం ఆవిడపనేమిటంటే రెండుమాట్లు కాఫీ, రెండుమాట్లు అన్నం తయారుచెయ్యడం; పిల్లకి జడ, నీళ్ళు నాలుగుదినాల కోమారు తలంటు! అయినా దుర్బలంచేత ఆమెకు చాలా కష్టంగావుంది. పనిచేసేమనిషి చీకటితో రాక పోయినా, పాలవాడు కొంచె మాలస్యంగా వచ్చినా ఆమె ఆదుర్దా యింతింతని చెప్పటానికి వీలులేదు. ఆవేళ కాళ్ళ కింద నిప్పులున్నట్టే!

# ఉ దా హ ర ణం



బెల్లం కొట్టిన రాయి! ఏం లాభం ?

## 3

"నేను చెబుతూంటే మీకు చెవునపట్టలేదుగాని పిల్లను బళ్ళోకి పంపటంవల్ల ఏమీలాభం లేదు."

రామారావు ఊరుకున్నాడు.

"నానోరు పడిపోవాలసిందేగాని నామాట యెవరు వింటారు?"

రామారావు ఏమీ మాట్లాడలేదు.

"బెల్లంకొట్టినరాయి ! ఏంలాభం"

"అయితే ! ఏమంటావు?"

"ఏమంటానా? నాశ్రాద్ధమంటాను"

ఇంకేం మాట్లాడుతాడు రామారావు?

## ౪

శారద బళ్ళోకి వెళ్ళినప్పుడుతప్ప ఇంట్లో ఉన్నంతసేపూ తల్లిచేతపూజే.

"పమిట అట్లా వేసుకున్నావేం?"

"కంచమెవరెత్తుతాడు నీతాత"

"హార్మోనియం ముట్టుకోకు అమ్మా ఆడుకో"

"అదుగో పోతున్నావు ! ఎక్కడికి? వస్తున్నా ఉండు!"

"మరీ పసిపిల్లవై పోతున్నావు; తలమీద చెయ్యిపెట్ట నియ్యవు ! ఎట్లావదులుతుం దీనూనె?"

"నేను జడ వెయ్యను పో! మీనాన్నచేత వేయించుకో?"

"మింగేవుగా! ఇకపో, వూరిమీదికి"

ఇట్లా ఎన్నో చెప్పటానికి వీలులేదు. ఈమె ఎంతకట్టడి చేస్తున్నదో శారద అంత మొండి చరుస్తున్నది. పెండ్లాముకు కోపము వస్తుందని పిల్లనే కూకలేస్తుంటాడు రామారావు.

౫

రామారావుకు సాయంకాలము స్నేహితులతో షికారు వెళ్ళటం అలవాటు. ఒకనాడు ఇంటికి ఆలస్యంగా వచ్చాడు. ముసుకుపెట్టుకొని పడుకునిఉంది సీతమ్మ. వచ్చేటప్పటికి ఇల్లు నిశబ్దంగావుం దాదినం. మునిగిందన్నమాటే! వచ్చాడు; కాళ్ళు కడుకొన్నాడు; పట్టుపంచ కట్టాడు; అన్నం పెట్టమన్నాడు. "ఏం! అన్నానికిప్పుడు తొందర?" "పొరపాటు! రేపటినుంచి పెందలాడే వస్తాలే!"

"రేపు రేపు! 30 యేండ్లయింది! నేచచ్చిందాకా ఇంతే"

"నేం చస్తే మీకేం! సాయంకాలంనుంచీ గుండెనొప్పి వచ్చి చస్తున్నాను! చూసేవాళ్ళా! తల్చేవాళ్ళా! మీరు నన్నిట్లా చంపండి. ఇంటో పదేండ్లపిల్లఉందీ అంటే యేంసుఖం లేదు! ఎందరో చచ్చారంటారుగాని నాకు చావురాదుకదా!" అంటూ ఘోటు ఘోటున యేడవడం మొదలు పెట్టింది సీతమ్మ.

౬

రామారావు పిల్లెల్లే చప్పుడు చెయ్యకుండా వున్నాడు. ఆదినం 10 గంటలైంది పడుకునేటప్పటికి. ఇట్లాదినం ఒకటి

చొప్పున యిల్లంటే భయమై పోయింది రామారావుకు. బైటికిపోయి యెక్కువకాలం గడపటానికి భయం.

రామారావూ భార్యా మాట్లాడటం చాలా తక్కువ. ఇంట్లోకేమైనా కావాలెనంటే మాట్లాడటం తప్ప ఇష్టాగోష్ఠి పోయి పదియేండ్లైంది.

"ఓ! ఇదిగో యిట్లారా"

"ఏం మునిగింది! అంతసయోధ్యతకు"

"కాదే! చూశావూ! వెంకట్రామయ్యగారికి జ్వరం వస్తున్నదట!"

"అయితే నన్నేం చెయ్యమంటారు?"

"పాపం! వంటరివాడు! పథ్యం పంపుదాం?"

"సరేలెండి! ఏదో నెత్తిమీదికి తెచ్చిపెట్టారనుకున్నా, అంతమెల్లగా పిలుస్తూంటే!"

"ఇంత చారుమెతుకే గదూ?"

"చారుగీరు ఎవరుపెడతారు? పొద్దుట్నించి కాళ్ళు తీసుకుపోతున్నాయి! నాచేతగాదు. మీయిష్టం"

"కుంపట్లో నిప్పుందా? ముట్టిచారేగా! నే పెడతాలే!"

"ఎంత పంతమండీ! ఇంట్లోవాళ్ళకీ పరాయివాళ్ళకీ నేదారికానా?"

"కోప్పడకు! పోనీలే!"

"ఆఖరుకు మాట నాకొస్తుంది. మీరు పరోపకారం చేసేవాళ్ళు, నేను వద్దనే దాన్ని; అంతేలెండి!"

## 8

పక్కింటి సుబ్బమ్మొచ్చింది ఒకరోజున. రామారావు ఇంట్లోనే వున్నాడు.

"ఏమండీ సీతమ్మగారూ! భోజనాలయినయ్యా?"

"లేదమ్మా"

'ఏం! ఈపాటికప్పుడే అయిపోవలసిన దేనే!'

'అవునుగాని, యివ్వాళకొంచెం ఆలస్యమైంది. మీరు భోంచేశారా?'

'మావారు ఎక్కడకో పోయినారు. వారు వచ్చే టప్పటికి ఆలస్యమౌతుందని నన్ను భోంచెయ్యమన్నారు. నాదైంది.'

'ఏమోనమ్మా! మొగాళ్ళనువదిలి నేను భోంచెయ్య లేను'

'ప్రాణంపోతున్నా కనిపెట్టుకోటమే?'

"తప్పకాదుటమ్మా?"

"నేనుండలేనమ్మా అట్లా కనిపెట్టుకుని."

"మావారుకూడా అంటారుగాని నేనెన్నడు అట్లా చెయ్యలేదు; చెయ్యలేను. నాకు అన్నం తిన్నట్టుండదు."

* * * *

మర్నాడు సుబ్బమ్మ సీతమ్మ అన్నంతింటూండగా వచ్చింది.

"ఏమండీ! ఈపిచ్చి పోలేదు మీకు?"

"ఏమిటండీ అది?"

"ఎంగిలి విస్తట్లో ఎట్లాతింటారండి? మా వారది చాలా అనారోగ్యమంటా రే!"

"మాకాలానికీ మీకాలానికీ భేదంలేదండీ? మీరు చిన్నవాళ్ళు, ఏమైనాచేస్తారు! మీరట్లాచేస్తారని మేమెట్లా చెయ్యము?"

"అనారోగ్యం కాదండీ?"

"ఏమైనాసరే, తినాలిసిందే"

సుబ్బమ్మ మొగుడు రైల్వేగుమాస్తా. మొగుడికి 50 రూపాయల జీతం. అయితేనేం! ఈకాలపుపిల్ల. అందుచేత కొంచెం నీటెక్కువ. నవనాగరకపు అలవాట్లు. సీతమ్మ కివ్వి గిట్టవు. పైపెచ్చు శారద సుబ్బమ్మనుచూసి నేర్చుకుంటుం దేమో అని భయం. శారద సుబ్బమ్మగారింటి కప్పుడప్పుడు పోతూండేది. వాళ్ళయింట్లో గొడవ ఒకమాదిరి. డబ్బులేక పోయినా టాకీకి వెళ్ళాలసిందే! ఈమధ్య కళ్ళజోడుకూడా మొదలెట్టింది. ఆడవాళ్ల మీటింగని, చందాలని, విందులని యింటి కాలస్యంగావస్తూవుండం— ఆమె మొగుడు విసుక్కోడం— అనేకమాట్లు శారద చూసింది. పైగా ఇంటికెవ రైనా మొగాళ్ళువస్తే వాళ్ళతో నవ్వులూ పకపకలూను. ఈ సంగతి ఆయన కిష్టంలేదు. మొగుడింటికి వచ్చేటప్పటికి

సామాన్యంగా పెత్తనానికి పోయిఉంటుంది సుబ్బమ్మ. ఆయన యింటింటికీ తిరిగి పెళ్ళా మెవరింట్లోవున్నది తెలుసుకోవడం, పిల్చుకురావడం, ఇటీవల వాళ్లకు మనస్సులు కలిసిలేవని చుట్టుపట్ల పుకారూ. ఇదంతాకూడా శారదకు తెలుసు. ఇట్లాగే చుట్టుపక్క ఇళ్ళల్లో ప్రతిదానిలో ఒకసమస్య వుంది.

౮

ఒకనాడు రామారావుకు రాత్రి 12గంటలకు మెళుకువ వచ్చింది. పిల్ల గుర్రెట్టి నిద్రపోతున్నది.

'ఇదిగో నిద్రపోతున్నావా?' అన్నాడు భార్యతో. జవాబు లేదు.

'మెళుకువ రాలేదా?'

సీతమ్మ పడుకున్న పక్కపొర్లింది.

'చాల్లెండి! ఇప్పుడే కునుకుపట్టింది. గుండెల్లో నొప్పొచ్చి బతుకుతానని అనుకోలేదు...అబ్బ! ఊరుకుందురూ!'

ఇట్లాగే పాపం సీతమ్మ పగలెట్లాగో తిరిగి తిరిగి రాత్రి పడుకుందా అంటే వొళ్ళు తెలియదు. ఒక్కొక్కరోజు గొడ్డు మూలుగుతున్నట్టు మూలుగుతూంటుంది. అట్లాలేని దినం యే మూడునెల్లకొక్కటో దొరుకుతుంది రామారావుకు! అంతే చాలులే అని సంతోషిస్తూంటాడు.

౯

వీళ్ళయింటి పక్కన నెలకు వెయ్యిరూపాయల ఉద్యోగస్తుడున్నాడు. ఆయన పెండ్లాం దాదాపు రోజూ మోటారులో

వెళ్ళి బజారునుంచి యేదో కొనుక్కొస్తూవుంటుంది. అంతే గాక గిన్నె అమ్మి కంచం,కంచం మమ్మి గిన్నె చేయిస్తూవుంటుంది. అంత యెక్కువగా ఖర్చుపెడదామని సీతమ్మకు లేదుగాని అట్లావుంటే బాగుండుననిమాత్రం ఉంది. అప్పుడప్పుడు అట్లాగే కొంటూంటుంది. రామారావు బజారుకు వెళ్ళి ఏమన్నా కొన్నరోజున సీతమ్మ కొంచెంసంతోషంగావుంటుంది. కాని ఖర్చు మాటెత్తేటప్పటికి మళ్ళీ వెనుకటి చిత్తవృత్తి ప్రకోపిస్తుంది! మొత్తంమీద యెప్పుడో తప్ప సీతమ్మ సణుగుతూనో, తిట్టుతూనో, సాధిస్తూనో,విసుక్కుంటూనో, కొప్పడుతూనో, ఏడుస్తూనో, వుండడమే! ఎప్పటూ సంసారంతో అసంతృప్తే! కోరికలు తీర్చలేని మొగుడు! చెప్పినమాట వినని కూతురు! చుట్టూ అంతా చీకటి! ఇలావుంది సీతమ్మబ్రతుకు.

ఇక రామారావుకి ఇంట్లోసౌఖ్యంలేదు. సంసారానికి డబ్బుచాలదు! చాలదనుకోకూడదు! మాటా మంచీ లేదు! నోరు తెరిస్తే తప్పు! ఇల్లంటేభయం! మనస్సులోమాట మనస్సులోనే! పరాయి వాళ్ళతో వెళ్ళ జెప్పుకునే స్వభావంకాదు! ఏమన్నా చెప్పుకుంటే చుట్టుప్రక్కవాళ్ళంతా ఆదర్శకసంసార మనుకుంటున్నారే! దానికి భంగం! అవమానం! ఏండ్లు గడచిపోతున్నాయి. స్థితిగతులు చిత్తవృత్తులు మారలేదు! సీతమ్మకింకా వోపిక తగ్గుతున్నది, విసుగెక్కువవుతున్నది. రామారావుకు శ్రమ తప్పలేదు; చివాట్లు తప్పలేదు. జీతం లేని జీతగాడని యీాయ ననుకుంటున్నాడు. జీతంలేని పనికత్తెనని సీతమ్మ అనుకుంటున్నది. గుంభనమాత్రం చెడలేదు. చుట్టుప్రక్కల వాళ్ళు మామూలు ప్రకారమే అనుకుంటున్నారు

రామారావాకప్పు డనుకుంటుంటాడు; "మా సంసారమే యిట్లాగా? అన్నీ ఇంతేనా?" మొత్తం మీద ప్రతిసంసారానికీ ఒక్క లోతున్నట్టే వింటున్నాడు. అదో తృప్తి మనస్సుకు అన్నింటికంటె తన భార్య యిట్లాచేసిందని లోకులు చెప్పకోకపోవడం అంతకంటె తృప్తి! దారెంబడి వెళుతూంటే 'ఆయన పెళ్ళామే.' అని వేలెట్టి చూపించుకోక పోవడం ఈకాలంలో చాలా గొప్ప విషయం.

౧౦

పిల్ల పెండ్లినిగురించి భార్యాభర్తలకు భిన్నాభిప్రాయాలు. "ఒకప్పుడు మామనస్సులు కలిసేడ్చినాయా" అని రామారావు మోడి వేసుకున్నాడు. సీతమ్మమాత్రం ఏ సంమనో దేని మీదపెట్టో చెప్పతూనే వుంటుంది.

"ఎవరింటికైనా వెళ్ళితే నోట్లో ఉమ్మేస్తారు"

"వాళ్ళసొమ్ము తిన్నామనా?"

"మనసొమ్ము మనం తింటుంటేనే యితరులచేత చీవాట్లు"

"ఎక్కడికి వెళ్ళకపోతే సరి"

"ఎప్పుడూ ఈయింటోనే పాతుకోమంటారు; మీకేం!"

"ఇప్పుడెక్కడి కెళ్ళాలె?"

"మీసంగతి గాదుగాబట్టి మీకు మరుపు. మామేనత్త కోడలు పెద్దమనిషైందని మొన్న ఉత్తరం మీరు చూడలేదూ?"

రామారావేం మాట్లాడలేదు.

"నేను వెళతానంటున్నా కదూ ! ఇక మాటరాదు !"

రామారావు నిరుత్తరుడైనాడు.

" నే నేమైనాసరే వెళ్ళాలసిందే ! ఎల్లుండి బయలు దేరుతున్నాను. పిల్లామీరూ ఉండండి"

"అట్లాగే ఉంటాం వెళ్లు."

"అంతేగాని త్వరలో పిల్లనొకరికిచ్చి మొక్కుతీర్చుకుందామని లేదు. వెళ్ళమంటారు మీకేం? ఎక్కడికి వెళ్ళేది? ఇక వక్కచోటే వుంది వెళ్ళటానికి !"

* * * *

"వెంకమ్మగా రమ్మాయికి సంబంధం యిట్టే కుదిరింది."

"అట్లాగా !"

"ప్రయత్నం చేస్తేగా ! మీరుమాత్రం చేతులు కట్టుకూర్చోండి !

"ఏంచెయ్యమంటావూ ! అయితే !"

ఏంలేదు. పిల్ల పెద్దదవుతే ఊరిబైట గుడిసె వేసుకోవలసిందే !"

"ఎందుచేత?"

"నన్నెవళ్లు రానిస్తారు?"

"వెధవలైనవారు రానియ్యకపోతే ! నేను పోనేపోను, ఎవరిండ్లకూ"

"అంతా వ్యధికరణం"

"ఈవిషయంలోమాత్రం యెక్కువగానాతో చెప్పకు!"

"ఏం సంసారం పాడు సంసారం !"

౧౧

శారద బడిమాని యింటిదగ్గరే చదువుకోటం మొదలు పెట్టింది. రామారావీవిషయంలోమాత్రం కాఠిన్యం వహించాడు. మిగిలిన అన్నివిషయాల్లోనోరుమూయించిన సీతమ్మకు పిల్లపెళ్ళిసంగతిలోమాత్రం మొగుణ్ని లొంగదీయటం చేతగాలేదు. విసుగు పిల్లమీదకోపంగా పరిణమించి మునుపటికంటె శారదకు కోతయెక్కువైంది. రామారావుకూడా దినదినానికి అష్టోత్తరశతనామపూజ! రానురానూ రామారావూ సీతమ్మ మాట్లాడడమే మానేశారు; మాట్లాడడం తప్పకపోతే అన్యాపదేశం.

'ఎల్లమ్మా! బియ్యం తీసుకురావాలని చెప్పు.' రామారావెదటనేవున్నాడు. బజారుకెళ్ళి బియ్యంతెచ్చాడు.

* * * *

'మడికట్టుకోవచ్చు వంటైంది.'

రామారావు మడికట్టుకొని భోంచేశాడు.

* * *

'వాకిట్లోమంచం ఇంట్లోకెట్లావస్తుంది?'

రామారావు మంచం లోపల తెచ్చిపెట్టాడు.

* * *

'వాకిట్లో వెన్నకేక వినబడుతున్నది. ఎట్లాయిస్తారో! నాలుగురూపాయలది తీసుకుంటే బాగుండును.'

రామారావు పిలిచి వెన్నకొన్నాడు.

*   *   *

'అమ్మాయీ! ఈపదిరూపాయలు అమ్మకిచ్చి యింట్లో వాడుకోమను.'

'అమ్మా!'

'ఏం! అమ్మకాదు అడివి;,

'నాన్న పదిరూపాయలు నీకిమ్మన్నారు.'

'ఆ చెక్కమీద తగలెయ్యి.'

*   *   *

ఒకప్పుడు రామారావుకు మడిబట్టవుండేదికాదు. పట్టు బట్టకట్టుకొని అన్నంతినేవాడు. ఒక్కొక్కదినం నీళ్ళుచల్లారి పోయేవి. అలాగే స్నానంచేసేవాడు. 'నెయ్యేనా అడగడా' అని సీతమ్మ లోపలనుంచి రాకపోతే ఉత్తన్నమే తినిపొయ్యే వాడు. ఈప్రకారం జరుగుతున్నది. ఒకదినం ఆపెపినతండ్రి కూతురొచ్చింది. సాయంత్రం రామారా వింటికొచ్చేటప్పటి కింట్లోవుంది. కుశలప్రశ్నలువేశాడు రామారావు. భోజనా లవుతున్నాయి. భోజనాలముందరా తర్వాతాకూడా అక్క బావల ప్రవర్తన ఆమెకు ఏమీ అర్థంకాలేదు. రాత్రి అక్కచెల్లెండ్రిద్దరు ఒక్కచోట పడుకున్నారు.

"అక్కయ్యా! బావా నీవు అట్లావున్నారేమే?"

"ఏం! ఎట్లావున్నాము?"

"వెనకటి అన్యోన్యం కనబడటంలేదు"

"అమ్మాయీ! పెద్దవాళ్ళయిన తర్వాత చిన్నప్పటల్లే

మెల్లప్పుడూ నవ్వుతూ పేలుతూ వుంటారు లే?”

“మనస్తాపాలు లేవుకద?”

“మనస్తాపాలూ లేవు గినస్తాపాలు లేవు”

“పిల్ల పెండ్లి ఏమనుకుంటున్నారు?”

“వెతుకుతున్నాం. దైవఘటన వుండా లెకదా?”

“చూశారా యేమైనా సంబంధాలు?”

“చూస్తున్నారు, చేతనైనంతమట్టుకు. లగ్నఘడియ రావద్దూ? మన తొందరెందుకు పనికొస్తుంది?”

మర్నాడు సాయంత్రం ఆమె వెళ్ళిపోయింది. విశేష మేమీ అంతగా కనపడకపోవటంచేతనూ ఆమె చిన్నదికాబట్టీ పెద్దవాళ్ళకు తాను సలహాచెప్పటం గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించిన ట్లనుకుంటారేమోననే భయంచేతా ఆమె నోరెత్తలేదు.

౧౨

పిల్ల ఎదుగుతున్నది. పిల్లను చూచినప్పుడల్లా సీత మ్మకు గుడ్ల నీళ్ళొస్తున్నాయి. పిల్లకు పెళ్ళికావడంకంటె లోకాని కెక్కువగా వెరుస్తున్నది సీతమ్మ. స్వవిషయంలో లోకానికి ప్రసక్తిలేదని మనశ్శాంతి కలగజేసుకునే పరిజ్ఞానం లేదు ఆమెకు. పిల్ల పెద్దదౌతున్నకొద్దీ యిద్దరికి మనస్సులు మరీమరీ దూరమై పోతున్నాయి. భర్తతో గట్టిగా ప్రసం గిద్దామా అస లిద్దరికి తెగిపోతుందేమో, సంసారంగుంభన చెడుతుందేమో అని భయం. నలుగురినోళ్ళల్లో పడటమేగా! రామారావుకుమాత్రం పిల్ల పెండ్లిచింత లేదు. ఏమైతే

అవాతుందని ముడేసుకున్నాడు. ఇట్లా వుండగా ఒక నాడు పిల్లను కదల్చిచూతా మనుకుంది సీతమ్మ; కాని ధైర్యం చాలడంలేదు. క్రమంగా శారదకు జ్ఞానం వస్తున్నది. వెనకటి మకురుతనం పోతున్నట్టు కనబడుతున్నది. ఇంట్లో అమ్మకు కొంచెం చేదోడుగా పనిపాట చేస్తున్నది. ఇల్లిల్లు తిరగటం కొంచెం తగ్గుతున్నది. "పెద్దదాన్నాతున్నాను. వేమ భాషల్లో జాగ్రత్తగా వుండాల"ని మనస్సులో కలిగినట్టు సూచనలు కనబడుతున్నాయి. చదువులోనూ సంగీతంలోనూ బాగా యెక్కొస్తూంది. తాళయుక్తంగా పాడటం అలవాటైంది. ఎవరైనా చూస్తేఆమెను తప్పక వివాహం చేసుకుందా మనిపించేట్టుంది. ఈమె యీడువాళ్ళందరికీ చుట్టుపట్ల పెండ్లిండ్లై పోయినాయి. ఇక ఈమె ఒక్కతే మిగిలింది. తండ్రి దినమూ ఒక్క గంటసేపు చదువుచెప్పటం అలవాటుచేశాడు. సీతమ్మ పైరివేటుమాష్టర్ను తీసెయ్యమని పోరుపెట్టేటప్పటికి తీసెయ్యాలసొచ్చింది. దినమూ వార్తాపత్రిక చదవటం నియామకం చేశాడు. అందుచేత ఆమెకు లోకజ్ఞానం బాగా అభివృద్ధి అయింది. హైందవ నాగరకతలో వున్న నిగ్గుయేదో తెలుసుకున్నది. ఇటీవల కొన్నాళ్ళనుంచి ఆమె తల్లితో ఘర్షణకే రావటంలేదు. తల్లికి సహాయం చేయనికాలంలో చదువు, సంగీతం, కుట్టు, తప్ప యితర వ్యావృత్తిలేదు. ఎప్పుడైనా తండ్రితో కారమ్సు ఆడేది. ఇట్లా కొన్నాళ్ళు గడిచాయి. ఒకసారి వాళ్ళ యింటి తలుపులు మూడు రోజులు మూసినట్టు లోకం చెప్పుకున్నారు. అప్పటినుంచి సీతమ్మ వాకిటాకి రావడమే మానింది. శారద పెద్దమనిషి అయి

నట్టు గుసగుసలు మొదలెట్టాయి.

ఇట్లా కొద్దిదినాలు గడిచినతర్వాత సీతమ్మ పట్టలేక ఒకనాడు "అమ్మాయీ" అని పిలిచింది.

రామారావింట్లో లేడు. సాయంకాలం మూడు గంటలైంది.

"వస్తున్నా" అని శారద లోపలికి వచ్చింది.

"నేనోవిషయం చెప్తాను, కోపం లేదుకదా అమ్మాయీ!" అన్నది సీతమ్మ.

"ఏమీలేదు. ఏమిటో చెప్పు."

సీతమ్మ కళ్ళనీళ్ళుకార్చడం మొదలుపెట్టింది.

"ఎందుకమ్మా? అట్లా అకారణంగా ఏడవడం?"

సీతమ్మకింకా యేడుపాగలేదు. ఏడుస్తూనే, ఈ డేరిన కూతురినిచూస్తుంటేఏడుపుగాక ఏమౌతుంది? "మీనాన్నతో ఏమైనా ముచ్చటిద్దామాఅంటే గుండెలు గుబగుబలాడుతాయి. ఈవున్నగోడుకూడా చెడుతుందనిభయం. నీవు బుద్ధిమంతురాలవైనావనుకుంటున్నాను. నామాటవింటావనుతల్లీ!' అంటూ యెదురుగా కూచున్న శారద చెయ్యిపట్టుకున్నది. శారద తలవంచుకొని 'వినవలసినవిషయమైతే తప్పకవింటాను' అన్నది.

'నీవు వివాహమాడుతానని నాచేతిలో చేయివేస్తే ఇక నేను కళ్ళనీరుకారిస్తే అప్పుడను'.

శారద మాట్లాడలేదు.

"ఆడవాళ్ళు వివాహం లేకుండా వుండటం చూశావూ"

"మన బ్రాహ్మల్లో మాత్రం చూళ్ళేదు"

"ఎవళ్ళల్లోనో వుండటం మన కెందుకు?"

"నెలదినాల కిందట నాన్న ఒకమా రీవిషయం నన్నడిగారు"

ఈమాట వినేటప్పటికి సీతమ్మకు కొంచెం ధైర్యము వచ్చింది. భర్తకూడా యీవిధమైన ఆందోళన పడుతున్నాడని తోచింది.

"నాన్న కేంచెప్పావు?"

"ఆలోచించి చెప్తానన్నా."

"మరి ఆలోచించావా?"

"ఎంతఆలోచించినా ఒక్కటిమాత్రం బాధిస్తున్నది నన్ను".

'నీమనస్సులో సందేహాలు తీరాలనీ, నువ్వు వివాహమాడి మమ్మల్ని నలుగురిలో పడెయ్యాలనేగా మా కుతూహలం!"

"అమ్మా! నీకు కోపం రాదుకద!"

"కోపమెందుకు తల్లీ?"

"గట్టిగా రాదంటేనే చెప్తా"

"ఇంకా యెట్లాచెప్పనమ్మా"

"భయమేస్తుంది చెప్పటానికి. నిన్ను దెప్పటానికిగాని అగౌరవ పరచడానికి గాని నేనీసంగతి అనటంలేదని నాకు అభయహస్త మిస్తే!—"

"చెప్పు, నేనేమీ అనుకోనులే !"

"మిమ్మల్నిద్దర్నీ యింట్లో చూస్తుంటే నిజంగా నాకు పెళ్ళంటే భయమేస్తూంది. నన్ను నువ్వే మనకున్నాసరే ! ఇదే పెండ్లికి దాంపత్యానికీ పరిణామమైతే నాకు పెళ్ళి యీ జన్మలో కాదు గదా, జన్మాంతరంలో కూడా వద్దు..."

సీతమ్మ మొగాన నెత్తురు లేదు. నిశ్చేష్టురాలవుతుందా అన్నంత రక్తహీనమైపోయింది.!

[ఈకథ గుంటూరునుంచివచ్చిన "ప్రతిభ" లో పూర్వం ప్రచురింపబడింది. దీనికి శ్రీ శివ శంకర శాస్త్రిగారు నామకరణం చేశారు.]

# నా కాలేజి యాత్ర

ఆదినము ద్వాదశీ సోమవారం. చీకటితోనే సోమవార మని జ్ఞాపక మొచ్చింది. పదిగంటలకే కాలేజి. మొదటిగంట పనిఉంది. తొలిదినము ఏకాదశి, ఉపోష్యమున్నా. స్నానం చేసి యేదో ముక్కుమూసుకున్న తర్వాత విస్తరిముందర కూచున్నా. పదిగంటలకు కాలేజీకి వెళ్ళాలనీ, మొదటిగంట పాఠం చెప్పాలనీ మరచిపోయినా. వెనుకటిదినం ఉపోష్యం గాబట్టి ఆకలి బాగావేస్తున్నది. పదార్థాలుకూడా బాగున్నై. రెండుపిండివంటలు క్షీరాన్నం చేశారు; స్వేష్టకృత్తుగా గొంతు కందేట్టు తిన్నా. 'దరిద్రుడికి ఆకలెక్కువ'న్నారు కదూ! లేవ లేక లేవలేక లేచి చెయ్యికడుక్కున్నా.

చటుక్కున జ్ఞాపకాని కొచ్చింది కాలేజీకివెళ్లాననీ, క్లాసు తీసుకోవాలనీ. చెయ్యి తుడుచుకుంటూ వాకిట్లోకివెళ్ళి టాంగా యేదైనా కనబడుతుందేమోఅని చూశా. ఎక్కడా కనుచూపు మేరలో లేదు. మాయింటి పక్క నేను వెళ్లే కాలేజీకే వెళ్ళే వక ప్రొఫెసరుగారికి కారువుంది. పోనీ ఆయన్ని తీసుకెళ్లమని అడుగుదామని చొక్కాతొడుక్కుంటానికి లోపలికెళ్ళా. షర్టు మాసింది. కొత్తది తీసుకుని గుండీలు పెట్టుకొనేటప్పటికి ఆల స్యమైంది. కారులేదు. అప్పుడు మనస్సు చివుక్కు మన్నది. ఇలాతోచింది :

"అందరు ప్యాసైనట్టు నేను కాలేదూ? ఫస్టుగా ప్యాసయి నానే! నా కాలేజీ ఉపాధ్యాయుల్లో నేనే ఆఖరు జీతగాణ్ణి ఎందుకు కావలె? అనేక మంది నాకంటె యెక్కువ జీతాలు పుచ్చు

కునే వాళ్ళు నావలె పరీక్షలు కాలేదే! నాకంటె పెద్దవాళ్ళు కాదే! నాకంటె యే యితర అసమాన యోగ్యత లేదే వాళ్ళ దగ్గిర! పాఠం చెప్పడంలోనా వాళ్ళకన్న యెక్కువ కాకపోయినా వాళ్ళకు తీసిపోనే! వారికంటె నాకు జీతము తక్కువగా యెందుకుండాలె? ఈ తారతమ్యం యెందుకుండాలె? ఈ తారతమ్యం చేతగదా అనేకులుపాధ్యాయులు నడవకుండా కాలేజీకి వెళ్ళుతూ వుంటే నాకు నడకతప్పనిసరి కావడం. ఈజీతాల తారతమ్య మెందుకుండాలి? ప్రపంచంలో మానవులందర్నీ సమానంగా సృష్టించలేదా పరాత్పరుడు?"

ఇట్లా అనుకుంటూ ఉండగా వాకిట్లోకి "అమ్మా! గుడ్డోణ్ణి! బిచ్చం!" అంటూ వక భిక్షువు వచ్చాడు. వాడి స్థితి నాకు మిక్కిలి విచారం కలగజేసింది. పాపం! చలికాలం. వంటి నిండా గుడ్డలేదు. తోడెవ్వరూ లేరు. కిందికి సరిపోయ్యే వక బట్టవున్నా యీ దేశాచార ప్రకారం దాన్ని తలకు చుట్టాడు! నాకంటె వయస్సులో పెద్దవాడు. కర్ర పొడుచుకుంటే తప్ప గుంటమెట్టలు తెలియవు. "నీకెవ్వరైనా ఉన్నారా?" అడిగితే "లేర"న్నాడు. అప్పుడు తెచ్చినబియ్యం మళ్ళీ లోపలికి తీసుకు వెళ్ళి, బీర్వాతీసి వకబట్ట వక చొక్కాతీసి (సగం పాతవేలెండి!) వాకిట్లోకివెళ్ళి వాడికిచ్చి వెనుకటి వాటికంటె రెండు రెట్లు బియ్యం పెట్టి పొళ్ళనన్నా. లోపలికి వస్తుంటే యిట్లాతోచింది:

'ఇందాకటినుంచీ నాహీనస్థితిని నేను తలుస్తున్నానే! పాపము! ఈ గ్రుడ్డివానితో పోల్చుకుంటే నేనెంతో అదృష్టవంతుణ్ని కదా! సర్వాంగా లున్నాయి. లేకపోతే నాగతేమై పోవునో! మనకెంతప్రాప్తమో అంత లభించింది! దీనికిఅసూయ

కూడదు. పరిపాలకుడు కొలగర్రతో హెచ్చుతగ్గులు కొలిచి అదృష్టాలకు గట్టుపెడుతాడు' అనుకుంటూవుంటే 9-30 గంట లైంది. అరగంట ఊహలకు విశ్రాంతి నిచ్చింది.

కాలేజీకి అరగంట నడక తప్పదు. బయల్దేరా! పొట్ట బరువుగావుంది. పట్టుకున్న గొడుగు కూడా బరువుగానే వుంది. అట్లాగే ఆయాసపడుతూ రోజుకుంటూ వక్కఫర్లాంగు నడిచా. మాయింటినుంచి కాలేజీకి వచ్చేదోవలో రెండుచోట్ల యెత్తెక్కి దిగాలి. దినాముకంటె ఆగట్లయెత్తు ఆనాడు యెక్కువైనట్టు కనబడింది. మళ్ళీ వాహనం సంగతి జ్ఞాపకానికి వచ్చింది. ఎప్పటికైనా వాహన యోగముందో లేదో! ఇట్లా యీ జన్మంతా రెండుకాళ్ల బండితోనే వెళ్ళిపోతుందేమో! పోనీ! మనకొచ్చిన ఉల్లాసీదాలకు యీపాటిగా రెండుకాళ్లమీద నుంచున్నాం! జీవితాంతానికి జీవనాధారం కోసం వెతుక్కోకుండా యింతనోటికీ చేతికి దూరం లేకుండా ఉంది. "ఇట్లా అనుకుంటూ మెట్లు దిగుతున్నా.

ఇంతలోకే మోటారుకారు యెదురుగ్గా వస్తున్నది. పక్కకుతొలిగా. వచ్చి మోటారు నాదగ్గిరఆగింది. చూస్తే నాస్నేహితుడొకడు! లోపలికి రమ్మన్నాడు. కానికాలేజీకి వెళ్ళుతున్నానని చెప్పి కాస్సేపు మాట్లాడా. చుట్టుపక్కలవాళ్ళందరి కళ్ళూ నామీదపడ్డాయి. బహుశః వాళ్ళంతా 'ఏవర్రా! మోటారులోపొయ్యే ఆయన యీయనతో బండిఆపి మాట్లాడాడు! అనుకుంటున్నారని నాకుతోచింది. నాపిచ్చి కాకపోతే వాళ్ళకిదేనా పని? మోటారు దోవలో రోడ్డుమీద నిలపడం చేత పొయ్యే దోవలేక వాళ్ళుఆగి, అది పోయింతర్వాత పోవ

టానికి ఆగారనీ, ఊరికే యాదృచ్ఛికంగా వాళ్ళకళ్ళు నామీాద పడ్డాయని నేనెందు కనుకోకూడదూ? 'వెధవ అహం. ప్రపంచాన్నంతా అహంతో చూడ్డం యీాజీవుడికి స్వభావం! అన్నింటినీ యీా 'అహం' గ్లాసులోనుంచి చూస్తూవుంటాడీ జీవుడు.

నేనెంతవాణ్ని? ప్రెసిడెన్సీ ఫస్టాప్యాసైనాను! నావలె ప్యాసైనవారు మా సహోపాధ్యాయులలో చాలమంది లేరు. నేను పరిశోధనచేశాను! గ్రంథాలు వ్రాశాను! గొప్ప వాళ్ళతో సహవాసము చేశాను...'అనుకుంటూ'నడుస్తున్నా. ఈ ఉత్తమపురుష ఉపయోగించటం యెప్పుడు మానేస్తానో నాకు జ్ఞానం అప్పుడు అంకురిస్తున్నట్టు నిదర్శనం.

టైమెంతైందో? అది తెలుసుకోడానికి సాధనమేదీ? ఛీ! అధమబ్రతుకు! రిస్టువాచి కొనుక్కోటానికి పడలేదు! మాకాలేజీలో చపరాసీల్లో అనేకమందికి రిస్టువాచీలున్నయ్యే! గోచీపెట్టుకున్నప్పట్నుంచి సంపాదిస్తున్నా. రిస్టువాచిలేదు ఒకటిరెండుసార్లు కొనుక్కుంటానికి ప్రయత్నించి మానేశా. రిస్టువాచీ మీాదినుంచి సిల్కుషర్టుమీాదికివెళ్ళింది బుద్ధి. పది హేనేండ్లనుంచి వక్క సిల్కుషర్టు కుట్టించుకుందామని ప్రయత్నం, ఇప్పటికీ సఫలంకాలేదు! ఈజన్మకు సఫలమయ్యేట్టు తోచదు." ఏమిటీదిక్కుమాలిన వూహ లనుకుంటూ త్వర త్వరగా నడవటం మొదలెట్టా. చేతనైనంత వడిగా పోతున్నా. రైలుగేటుదగ్గరకొస్తున్నా. బర్రున చప్పుడుచేస్తూ అత్యంత వేగంతో ఒకమోటారుబండి వస్తూన్నది. దారి తొలిగి నిల్చున్నా అది యెక్కడాలేని వేగంతో నన్నుదాటిపోయింది. నాకళ్ళనిండా దుమ్ముపడ్డది. అది మంత్రిగారి కారు! "కళ్ళు

# నా కాలేజీ యాత్ర



1. "అమ్మా ! గుడ్డోణ్ణి బిచ్చం" అంటూ వక బిక్షువు వచ్చాడు.
2. అట్లాగే రోజుకుంటూ వక్క— ఫర్లాంగు నడిచా.
3. జేబురుమాలా తీసి కండ్లు తుడుచుకుంటూ నిల్చున్నా.
4. ఆయన నావైపు తిరిగి నవ్వుతూ నాకు సలాం చేశాడు.
5. కుర్చీలో కూర్చునేటప్పటికి ప్రాణం సొమ్మసిల్లినట్లయింది !

లేంది కలియుగమే లేదుగా!" ఆగిపోయినా. జేబురుమాలతీసి కండ్లు తుడుచుకుంటూ నిల్చున్నా. గంట అవుతుందేమో నని భయం. తెరిస్తేగాని నడవలేను. తుడుచుకోగా తుడుచు కోగా కళ్ళు తెరిపిచ్చాయి. బయల్దేరా:

"ఈ మోటారు నాకంట్లో దుమ్ము కొట్టటానికి నేను దానికి గానీ, దాంట్లో వెళ్ళే ఉద్యోగికి గానీ యేంచేశానూ? ఈమోటార్లకు, అందులో వెళ్ళేవాళ్ళకు, దోవలో నడిచే వాళ్ళ కళ్లల్లో దుమ్ముకొట్టడమేనాపని? ఇట్లా దుమ్ముకొట్ట డానికేనా వీళ్లకీ ఉద్యోగాలియ్యటం? శకటాలు, వాట్లో వెళ్ళే వారుకూడా యిప్పుడేనా? పూర్వకాలంనుంచీ కూడా నడిచి పోయ్యేవాళ్ల కళ్లల్లో దుమ్ము కొట్టేవాళ్ళా? నడిచిపోయే వాళ్ల గతి యెంత చులకనైంది? వాళ్ల మానానికి వాళ్లు పోతున్నారే! ఇక వీళ్లకళ్ళల్లో దుమ్మెందుకు కొట్టాలి? పెద్దజంతువు చిన్న జంతువు కళ్లల్లో పెద్దమనిషి చిన్నమనిషి కళ్లల్లో, బండ్లల్లో వెళ్ళేవాళ్లు నడిచేవాళ్ల కళ్లల్లో, పెద్దఉద్యోగస్థులు చిన్న ఉద్యోగస్థుల కళ్లల్లో, మట్టికొట్టడం, ప్రపంచపు పరిపాటేమో!" అనుకుంటూ మా కాలేజీకి దరిదాపు పోయాను. అక్కడ నా పక్కనుంచి అనేకమోటార్లు పోతున్నాయి. కాని ఎంతవేగంగా వెళ్తున్నా సిమెంటురోడ్డు గాబట్టి నా కళ్లలో దుమ్ము పడ లేదు. అప్పుడు కళ్లల్లో దుమ్ముకొట్టడం మోటార్లకు, వాటిలో వెళ్ళేవాళ్ళకు స్వభావంకాదనీ, రోడ్డుయొక్క స్వభావంమీద ఆధారపడి ఉందని నాకు తట్టింది. ఎంత దుర్మార్గుణ్ణి? మోటా ర్లనీ వాట్లో వెళ్ళేవాళ్ళని అన్యాయంగా తిట్టానే? అపచారం!

వచ్చివచ్చి మా కాలేజీగేట్లుదగ్గరకు వచ్చా. గంట

మోగుతున్నది. కాని లోపలి కెళ్ళటానికి వీలుకలుగ లేదు. వచ్చే మోటార్లు వస్తున్నాయి. పొయ్యేవి పోతున్నాయి.

ఇంతలోకే మా కాలేజీలో పనిచేసే యొక ప్రొఫెసరు గారుకూడా మోటార్లో వచ్చాడు. ఆయన నావైపు తిరిగి నవ్వుతూ నాకు సలాం చేశాడు. నేనుకూడా లోపలున్నదంతా అణచుకొని నవ్వు తెప్పించుకొని సలాం చేశా. మావూళ్ళో లోపలికంటే బయటికి గౌరవప్రదర్శనం అమితంగా కనిపిస్తుంది. గేటు దాటి లోపలికి పోయినాను. అలుపుతీర్చుకోటానికి సమయమేదీ?

మీద గంత (ఎకడమిక్ డిగ్రీ గౌను) తగిలించుకున్నాను. క్లాసులోకి వెళ్ళటానికి ముప్పై మెట్లెక్కాలి! అవెక్కేటప్పటికి నాకు నూరేళ్ళు నిండినాయి. కుర్చీలో కూర్చునేటప్పటికి ప్రాణం సొమ్మసిల్లి నట్లయింది! కొన్ని నిమిషాలు అట్లాగే కూర్చున్నా. మా పిల్లలు చాలా బుద్ధిమంతుల్లెండి! మేష్టరుగారు డస్సి ఉన్నారని గ్రహించి పాపం ఏమి అల్లరిచేయకుండా కూర్చున్నారు.

* * * *

ఆ రోజునుంచీ రెండు తీర్మానాలు చేసుకున్నా!

(ఒకటి) ఉదాత్తంగా భోం చెయ్యకూడదు.

(రెండు) నాపిల్లల్ని బండిలో తప్ప బడికి పంపకూడదు.

[ ఈ కథ నిజాం కాలేజీ పత్రిక "విద్యార్థి" లో పూర్వం ప్రచురింపబడింది.]

# స్వర్గీయ ఆచార్య కురుగంటి గ్రంథావళి

*1 కురుగంటి కథావళి
*2 శాతకర్ణి నవల
3 తోఁచినట్లు
4 కురుగంటి నాటికలు
5 ఆంధ్ర భాషా చరిత్ర
6 ఆంధ్ర సంస్కృతి చరిత్ర
7 ముద్రారాక్షస వ్యాఖ్య
*8 అలంకార తత్త్వ విచారము
9 Kuruganty Essays
10 కురుగంటి వాణి
*11 షడ్దర్శనములు
12 ధ్యానము—జీవితము
13 ధర్మము—వేదము
14 దాక్షిణాత్య దార్శనికులు
15 ఆంధ్రుల పుట్టు పూర్వోత్తరాలు
16 కురుగంటి ఉపన్యాసములు
*17 ద్రష్టలు—దేశికులు
*18 భూమి—మానవుఁడు
19 Tanjore Nayakas
20 Sanskritic Studies
21 నవ్యాంధ్ర సాహిత్యవీథులు (శ్రీ పిల్లలమఱ్ఱివారి సహకారముతో)
*22 తంజాపురాంధ్ర నాయకరాజ చరిత్రము
*23 అసఫ్జా VII పంచవింశతి వర్ష రాజ్య చరిత్రము
24 కురుగంటి వ్యాసలహరి ౧ (చారిత్రకము)
25 ,, ,, ౨ (భాషాపరము)
26 ,, ,, ౩ (సాంస్కృతికము)
27 కురుగంటి వ్యాసావళి (సాహిత్యము)
*28 కొందఱు తంజావూరు కవులు—పండితులు
29 Studies in Satavahana History
*30 A Hand Book of Telugu Literature

*ఈ గుర్తు కలవి ముద్రిత గ్రంథములు.


*Please Address :*

**Sri Kuruganti Krishna Murthy,** B. COM., LL.,B.,
Dy. Tahsildar, GADWAL, Mahbubnagar Dt., Andhra Pradesh